AN ORIGINAL DRAMA IN 3 ACTS

BY

GANJEE BALASHOURI REDDY

*Author of*

*Srungara Julian Natakam, Eustachius Natakam and Sree Jobuni Vijaya Vilasa Natakam.*

Rentachinatla, Guntur, Dt.



శ్రీ

# మృత్యుంజయ నాటకము

గంజి బాలశౌరిరెడ్డి రచితము

రెంటచింతల.



బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1930

SREE

# Mruthyunjaya Natakam

AN ORIGINAL DRAMA IN 3 ACTS

BY

GANJEE BALASHOURI REDDY

*Author of*

*Srungara Julian Natakam, Eustachius Natakam and Sree Johunu Vijaya Vilasa Natakam,*

Rentachintala, Guntur Dt.

శ్రీ

# మృత్యుంజయ నాటకము

గంజి బాలశౌరిరెడ్డి రచితము

రెంటచింతల.

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1930

## FOREWORD

Mr. Ganji Bala Shourireddi, the author of this little book called Mruthyunjayanatakam has asked me for an introduction to his book. He himself needs no introduction to our Telugu Catholics as he has already produced several other excellent religious dramas which have been deservedly appreciated.

This book on the passion and the resurrection of our Lord Jesus Christ, the author has produced in verse, in a style easy and fluent. He has depicted the various stages of the passion most vividly and one feels a thrill of triumph when going through his exposition of the resurrection.

The author is to be congratulated on the production of this very valuable book in which, while taking all the practical licence permitted, he has not swerved from the teachings of the Catholic Church. Such books are a valuable addition to catholic literature.

May he produce several others of the kind for the benefit of our catholics and for the encouragement of others to follow his example! May God bless and reward him for his arduous labours! That every catholic family should possess and read this valuable book from time to time specially during Lent, is my ardent desire.

B. MARIANNA,

Rector of St. Mary's School,

Dated 11—4—30. Secunderabad.

# తొలిపలుకు

ఈ మృత్యుంజయ నాటకమును రచియించిన గంజి బాలశౌరిరెడ్డి గారు దీనివిషయమై, నన్నొక యుపోద్ఘాతమును వ్రాయమని కోరిరికాని, వీరు మన ఆంధ్రకథోలికు లోకమంతట, దన సుప్రసిద్ధ వేదగ్రంథ నాటకములచే వెలసి ప్రఖ్యాతివడసినవారైనందున, నేనీపరిచయ సందేశమును వ్రాయుట యనవసరమని తోచుచున్నది.

శ్రీ యేసుక్రీస్తు నాధుని తిరుపాటులను, శ్రీవారి జయ పునరుత్థానమును నివేదించెడి యీగ్రంథము, అతిసులభ ప్రవాహిత శైలియందు రచియింపబడినది. పాటులను సూచించెడిభాగము, అతివిశదముగను ఎల్లరమనంబులకు దట్టునట్టుగ వివరించబడినది. ఉత్థానవుభాగము మానవుల మనస్సు లుప్పొంగునట్లు జయప్రదముగ వర్ణింపబడినది. కార్యక్రమముల ననుసరించుచు కథోలికు వేదసత్యముల కనుకూలముగ వ్రాసిన గ్రంథకర్తను బహూకరించుట సమంజసము.

ఇట్టి గ్రంథములు కథోలికు వాఙ్మయమునకు నభివృద్ధి పఱచుననుటకు సంశయములేదు. ఆంధ్రకథోలికుల కుపయోగకరముగను, విద్యాభిమానులకు సుమాత్రుక నొసగుటకును మరికొన్ని నాటకములు ప్రకటింతురని నమ్ముచున్నాము. ఈవెలగల గ్రంథమును ప్రతి కుటుంబమువారు పొందియుండి, అప్పుడప్పుడు చదువుటయేగాక, విశేషముగ తపస్సుకాలములో చదవవలెనని నాకోరిక. గ్రంథకర్తయొక్క ప్రయాసలను ఏలినవా రాశీర్వదింతురుగాక!

బి. మరియన్న.

# పీఠిక.

ఈ నాటకమున మన రక్షకుని మరణవిధానము శ్రీవారి యుత్థానమును విపులముగాఁ జూపించఁబడినది. ఈ చరిత్రము యేసునాథుని నిజవృత్తాంతమైనందునఁ గల్పనలేమియుఁ జేర్చియుండలేదు. హైదరాబాదు మేత్రాసన గురుప్రసాదుల యభిప్రాయము ననుసరించి సులభశైలితో వ్రాయబడినది. మన ఆంధ్రసోదరుల కందరికి నర్థము స్ఫురించునట్లు వాడుకపదములలో రాణువవారి పద్యము లల్లఁబడినందున నన్ను క్షమింతురుగాక. ఇందు ముఖ్యముగా భాషాశైలినిఁ బరికింపక యేసునాథుని వేదామృత సారముఁ గ్రోలి యానందింపవలయునని ప్రార్థించెదను.

వెలమకన్న,<br>
19—8—80.

గంజి బాలశౌరిరెడ్డి,<br>
గ్రంథకర్త.



# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

1. సూత్రధారుడు
2. మాణిక్యము
3. యేసునాథుడు - కథానాయకుడు.
4. రాయప్ప - యేసునాథుని శిష్యుడు
5. జ్వాన్నేసు      డిటో
6. సిమియోనుడు      డిటో
7. యూదానుడు - యేసునాథుని దొరలకు పట్టించిన శిష్యుడు-గురుద్రోహుడు
8. అనానుడు - ప్రధానగురువు - కైపాను మామ
9. కైపానుడు - ప్రధానగురువు - అనాను అల్లుడు
10. పిశాచము - సైతానుడు
11. సన్మనస్కుడు - దేవమాత
12. మాల్కూను - ప్రధానగురువైన కైపాను బానిసదాసు
13. వేదపాఠకులు
14. సేవకులు - 1-2-3-4 ప్రధాన గురువుల భటులు
15. పోంస్యుపిలాతుడు - రోమాపురి చక్రవర్తి ప్రతినిధి
16. హెరోదుడు
17. మంత్రి
18. అంతరంగికుడు-పిలాతుని కార్యదర్శి
19. 1 రాణువ - పిలాతుని పారాదారుడు
20. 2 రాణువ - పిలాతుని సైన్యాధిపతి
21. 3 రాణువ.

(19–21: యేసునాథుని హింసించిన వారలు)

22. 4 రాణువ
23. దేవమాత యేసునాథుని తల్లి
24. శిమియోను సిరేనూరివాడు
25. వెరోనికమ్మ - యేసునాథునికి ముఖము తుడుచుకొనుటకు వస్త్రము నిచ్చిన స్త్రీ.
26. మొదటి స్త్రీ
27. రెండవ స్త్రీ

(26–27: జెరుసలేం పుణ్యస్త్రీలు)

28. మొదటి దొంగ
29. రెండవ దొంగ

(28–29: యేసునాథునితో శిలువలో కొట్టబడిన వారలు.)

30. జోసేఫుడు
31. నికోదేముడు

(30–31: యేసునాథుని శిష్యులు.)

శ్రీ

# మృత్యుంజయ నాటకము

## ప్రథమాంకము.

---

### నాందిప్రస్తావన.

సూత్ర— శ్రీసర్వేశుని మదిలో
భాసురమతి సన్నుతించి • భక్తిదలిర్పఁ
జేసుని మృత్యుంజయ మను
వ్రాసితి సభవారు మెచ్చ • వన్నెలఁదీరఁ.

గీ॥ భువనసృష్టినిఁ బాత్రలఁ • బొందఁజేసి
జగమునంతటఁ క్షేత్రంబుఁ • జాల వేడ్క
నావలెనె నాటకంబుల • నడుపునట్టి
సూత్రధారుండు మిముఁ బ్రోచు • శుభము లొసఁగి.

(తెరవంకఁ జూచి) మాణిక్యం యొకసారి యిటు రాగలవా!

మాణిక్యం—ఇదిగో వచ్చుచున్నాను. తమసేవకుని కేమియాజ్ఞ!

సూత్ర—ఏమియాజ్ఞ యనుచున్నావా? ఈ సభారంగమును జూడుము. కాలహరణమున కోర్వఁజాలకఁ ద్వరపడుచున్నారు. మనమేమో యొక యపూర్వనాటకమును ప్రదర్శించి వీరి డెందముల కానందముఁ గలుఁగఁజేయుదమను యాశచేత మననాటకశాలకు విజయముఁజేసి మనవంక నెట్లుఁ జూచుచున్నారో చూఁడు. కావున మన మీరాత్రి యొకయపూర్వమైన నాటకము ప్రదర్శించి వీరిని యానందింపఁజేయుట సమంజసము.

మారి— అబ్బబ్బా! నీ యూహాపోహాలు లతిశయముగా నున్నవే! బాలురమైన మనమెక్కడ! అపూర్వనాటకప్రదర్శన మెక్కడ! స్తనశల్యఁ బరీక్షఁ జేసెడి నీమహాసభ్యుల హృదయరంజన మెక్కడ? సకలశాస్త్ర పరిశ్రమమం దారితేరిన నీసభాసదుల సంతోషపెట్ట నెంతటి శక్తిమంతులు కావలెను!!

సూత్ర—సకలసుగుణంబుల కాటపట్టయిన వీరికడ మన మెంతమాత్రము భయపడవలసిన పనిలేదు. ఆటపాటలయందు మనయొద్ద నెన్ని లోపము లున్నను వాని గణింపక మన గుణలేశముచే మెచ్చి సంతసింతురుసుమా! అట్లు కాదేని మనలోపములఁ జూపిన మన కదియే శ్రేయోదాయక మగును.

మారి—అయ్యా! అమోఘకరమైన మీయభిప్రాయమున కానందించు చున్నాను. సంగీతసాహిత్యమునం దారితేరిన మీరుండ మాకేమి భయము? నాటకనిర్దేశ మొనర్చి నన్ను కృతార్థునిఁ జేయుఁడు.

సూత్ర— మంచిది (ఆలోచించి) మృత్యుంజయ నాటకమును ప్రదర్శింతము.

మారి—మృత్యుంజయ మనఁగా నేమి?

సూత్ర—మనరక్షకుఁడైన జేసునాధుఁడు మృతిని జయించినందున దీనికి మృత్యుంజయనాటకమని కవి సమర్థించెను. కాని యిది జేసునాధుని పాటుల చరిత్రము.

మారి—అయితే దీని నెవరు రచించిరి?

సూత్ర—సీ॥ ఆంధ్రమందునఁ గవితంబు • నల్లువాఁడు
గంజి యిన్నయ్య పుత్రుండు • ఘనయశుండు
తెలుఁగు జేసుని శిష్యుండు • శౌరిరెడ్డి
నాటకంబుగ రచియించె • నవ్యము గను.

మారి—ఈ నాటకము రక్తిగట్టించుట సులభముగాదు. దీనియందు విశ్వాసమునకును, మాతృకకును విరుద్ధములైన కార్యము లెవ్వియుఁ గన్పింపరాదు.

సూత్ర—ఇందుఁ బాత్రలన్నియు భయభక్తులతో నటించిన యతిసులభ

శ్రీ

# మృత్యుంజయ నాటకము

## ప్రథమాంకము.

### మొదటి రంగము.

The washing of the feet: Christ institutes The Blessed Sacrament.

జేసునాథుఁడు సత్త్వపాదముఁ గళిగించుట.

(జేసునాథుఁడు పన్నెండుమందిశిష్యులతో మేజాబల్లచుట్టు కుర్చీలపైఁ గూర్చుండుట.)

రాయప్ప—గురువర్యా! ఈపాస్క మహోత్సవము ను ప్రజలెల్లరు నాచరించుటకు గారణమేమి?

జేసు—సహోదరులారా! పూర్వకాలము ఐజిప్తురాజ్యములో మనవారలందఱికి బానిసవృత్తి సంప్రాప్తమయ్యెను. దానివిషయమై మనవారియందు శ్రీసర్వేశ్వరునికి కరుణజనించి వారి బానిసవృత్తిని విముక్తిఁ గావించినఁదున నాదినమువఱకు జ్ఞాపకార్థముగా మనవారు ప్రతియేట నీపాస్కపండుగ నాచరించుచున్నవారు.

రాయప్ప—గీ॥ తనరునైగుప్తు బానిస • తనము తొల్గి
పాపినందుకు జూదయ • ప్రజలు మెచ్చి
పరమనాథుని సేవింప • పాస్కయుత్స
వమును సాగించిరని దెల్సె • వందనీయ.

జేసు—మంచిది మనమిప్పుడు త్వరఁగా పాస్కను భుజింపవలసియున్నది.

రాయప్ప—చిత్తము.

జ్ఞానస్నేను — గురువర్యా! నేఁడు మీముఖవిలాసము నవలోకింప నన్నుఁ
దరిగి చింతాసాగరమున మునిఁగి యుండుటకుఁ గారణమేమి?

జేసునాథుఁడు — శిష్యులారా! మీలో నొకఁడు నన్ను నాశత్రువుల కప్ప
గించును. ఇప్పుడతఁడు సైతానుకు ముద్దుకుమారుఁడై యున్నాఁడు.
ఆఁ వెడఁగుఁడు తన తల్లికడుపుకుఁ జేటుఁగాఁ జన్మించెఁ గాఁబోలు!

జ్ఞానస్నేను — రబ్బీ! మీకాయమును తమశత్రువులకు నొప్పగించెడి పామ
రుఁడు మనలోనున్నాఁడా? ఆతఁడెవఁడు?

జేసునాథుఁడు — శిష్యులారా! అతిశయమొందెదరేమి? తొల్లి మనుజ
పుత్రునిఁగూర్చి లిఖించిన లిఖితములు నెఱవేఱవలెనుగదా! నేను
మీకుఁజెప్పినవన్నియు సత్యములని విశ్వసింపుఁడు. నాకు మరణ
కాలము సమీపించినది. కావున మనముత్వరఁగా పాస్కను భజిం
పవలెను. (అనివస్త్రము నడుముకుఁ గట్టుకొని రాయప్పగారి
కాళ్ళఁగడుగఁబోవుట.)

రాయప్ప — (లేచి) స్వామీ! మన్నించుము. నామనవి నాలకించుము.

సీ॥ ఆదియంత్యములేని • యాదికి మూలమై
యతిశయించినయట్టి • యతివరేణ్య
మనుజులరక్షింప • మహికినేతెంచిన
పరమపావనమూర్తి • గురువరేణ్య
సత్యవేదమునెల్ల • జనులకు బోధింప
ధరణికేతెంచిన • గురువరేణ్య
శాంతము శమదాది • స్వాభావికంబైన
పరమాత్మ సత్పుత్ర • గురువరేణ్య

గీ॥ పుడమిసృష్టికి నాశన • ప్రోదికెల్ల
హేతువగుచునుభక్తుల • నెందు ప్రోచు
ఘనుడ వీవేడ? నాకాళ్ళు • గడుగుటేడ?
దేవగణభూమ సద్ధర్మ • దివ్యధామ.

గురువర్యా! ఈసాహసకార్యమునకు నేనెంతమాత్రము సహింపఁ
జాలను. ప్రపంచములో నెచ్చటనైనను శిష్యులకాళ్ళను గురువులు కడు
గుటఁగలదా?

జ్వాన్సేను—సీ॥ ఇదియేమి గురువర్య • యీకార్యమెచ్చటైన
జరిగెనే యికముందు • జరుగఁబోనె?
శిష్యులకాళ్ళను • జెలఁగి నాచార్యుండు
కడుగునె యికముందు • కడుగఁబోనె?
తల్లియుఁదండ్రియుఁ • దనయుల పాదముల్
దుడుతురే యికముందు • దుడవఁగలరె;
ఘనులచేఁగాళ్ళను • గడిగించుకొనమాకు
భావ్యమే యికముందు • భావ్యమగునె?
గీ॥ కాన మీరఁదగు కోరిక • మానవలయు
నిపుడు దయతోడ మమ్ము మ • న్నింపవలయు
కువలయంబున మాసేవఁ • గోరవలయు
పుణ్యజనపోష మానవ • భూరివేష.

శిమియోను—స్వామీ ! మీరు పరలోక భూలోకమును గలిగించి యందలి సమ స్తసృష్టులకు మూలమైన మిమ్మును మాగురువుగాఁ దెలిసికొనియుండియు మీచేఁగాళ్ళను కడిగించుకొనుటయు క్రమము కాదు. కావున తమరి యభిప్రాయమును మార్చఁజేసికొనవలయు నని ప్రార్థించుచున్నాను.

జేసు—సహోదరులారా ! మీకేలోందరేల ? భూలోకములో నేను మీపాదములఁ గడిగి పరిశుభ్రము చేయనిచో పరలోకములో మీరు నాతో భాగస్థులు కానేరరని నొక్కి వక్కాణించుచున్నాను.

రాయప్ప—అట్లయితే, నాపాదములేకాదు నా దేహమంతయుఁ గడిగి నన్ను కళంకరహితునిఁగాఁ జేయుఁడు.

జ్వాన్సేను—గురువర్యా! మీయిష్టప్రకారము మీసంకల్పము నెఱవేర్చి మమ్ముల పరలోకములో భాగస్థులఁ జేయుటకై ప్రార్థించుచున్నాను.

శిమియోను—ఏలినవారా! మీయభిప్రాయమునకు నాటంకముఁగలిగించినందులకై పశ్చాత్తాపమునొందితిని కావున మన్నించవలయు ననిఁ బ్రార్థించుచున్నాను.

యేసు—శిష్యులారా! ప్రపంచములో స్నానముఁజేసెడి ప్రతిమానవుఁడు తనశరీరమునంతటిసిఁ బరిశుభ్రముసుఁ జేసికొనుచున్నాఁడు. అయితే మీరు శుద్ధిగానున్నందున నేను మీపాదములఁగడిగినంత మాత్రమున జాలునుగాని మీరందఱు శుద్ధిగానుండనందులకై చింతించుచున్నాను. (అని శిష్యుల పాదముల గడుగుటఁ జేసునాధుఁడు కూర్చుండుట.)

జ్యాన్సను—గురువర్యా! మిమ్ముశత్రువులకొప్పగింపఁబూనిన సాహసునిఁ దెలుపవలయునని ప్రార్థించుచున్నాను.

శిమియోను — అవునుతండ్రి! అట్టికృతఘ్నుఁడెవఁడో తెలిసికొనుట యవసరమైయున్నది.

రాయప్పు—యతివరేణ్యా! అట్టునంటిస్వామిద్రోహుఁడు మనలోనున్నాడని నొక్కివక్కాణించితిరిగదా? వానిఁదెల్పి నన్నుకృతార్థునిఁ జేయవలెనని ప్రార్థించుచున్నాను.

యేసు—తెలుపకపోవడమేమి? ఎవఁడునాతోపాటు నాపానపాత్రమునఁదన చెయినిఁడునో యతఁడునన్ను నాశత్రువులకు నొప్పగించును.

గీ॥ అయితె ననుశత్రువులఁ జేతి • కప్పగించు
మనుజుఁడిమ్మహిలోపల • మరణమొంది
నరకసాగరమందు న • నాంతంబు
శ్రమనుఁజెందును సువిశేష • చారులార.

జూదానుఁడు— ఏలినవారా! మీదేహమును మీశత్రువుల కప్పగింపఁబూనిన దుర్మార్గుండను నేనా?

యేసు—(మౌనము)(అప్పమునందుకొని యాశీర్వదించి, శిష్యులారా! ఈయప్పమునుఁ భుజింపుఁడు. ఇది మనుజులకొఱకై త్రునునొందఁబోయెడి నాశరీరమైయున్నది. (అనిఒక్కొక్కరికినివ్వగా భుజించుట) (పాత్రమునందుకొని) ఈరసమును మీరుపానముజేయుఁడు ఇది లోకులపాపములకొఱకై చిందఁబోయెడివారక్తమైయున్నది. ఇఁక నేను సర్వేశ్వరుని సాన్నిధ్యము నకఁగి నవరసమును సేవించుపఱకు నీ ద్రాక్షారసమును పానముఁజేయనని మీతో నిజముగాఁజెప్పు

చున్నాను. అయితే ఈసంస్కారమును నాజ్ఞాపకార్థమైయాచరింప వలయునని మీకు నాజ్ఞాపించుచున్నాను.

రాయప్ప — మీయాజ్ఞను శిరసావహించుచున్నాము.

జ్యాన్నేను — గురువర్యా! మిమ్మును శత్రువులకు నొప్పగించెడి పాపిష్టుని దెలుపవేఁడుచున్నాను.

రాయప్ప — గురువర్యా! ఇండజీతో నాకృతఘ్నుఁ దేటపఱచి యట్టివాఁడగునకుఁ దగిన ప్రాయశ్చిత్తమొనర్పుటకై ప్రార్థించుచున్నాను.

యేసు — శిష్యులారా! నన్ను నాశత్రువుల కప్పగింపఁబూనిన కృతఘ్నునకుఁ దగినశిక్ష పరలోకమున విధింపఁబడును. ఎవరికి నేను యీరొట్టెముక్కనురసమునముంచి యీయఁగలనో యతఁడు నన్నుశత్రువుల కప్పగించునని దెలిసికొనుఁడు. (రొట్టెముక్కను జూదానునకిచ్చి) జూదాసా! నీవు సాహసించిన దుష్కార్యమును త్వరగా నెఱవేర్చుకొనుము (జూదానుడు చుఱుకవ లేచిపోవుట) పుత్రులారా! మనుజకుమారుఁడు వినుతికెక్కెడికాలము సమీపించినది. సర్వేశ్వరుఁడు, ప్రతిష్ఠింపఁబడుదురుగాక. ఇఁక మేముమీతో దీర్ఘకాలముండఁజాలము. త్రుటిమాత్రమని గ్రహించుఁడు.

రాయప్ప — ఏలినవారా! మీరెక్కడికి వేంచేసెదరు?

యేసు — సహోదరులారా! నేను వేంచేయఁబోయెడి స్థలమునకు మీరు రాజాలరుగదా?

రాయ — గురువర్యా! మేమెందుకురాజాలము. అవసరమైతే నేను మీకొఱకుఁ బ్రాణమొసఁగుటకు సంసిద్ధుఁడనై యున్నాను.

యేసు — రాయప్పా! ఈవ్యర్థప్రగల్భములు నిష్ప్రయోజనములు. నేఁడు కోడికూయుటకుముందు నీవునన్నెఱుఁగనని మూఁడుసార్లు బొంకెదవు ఈమాటలు నీమానసమునఁ ద్రికరణశుద్ధిగా నమ్ముము.

రాయప్ప — దేవరవారిచిత్తము. నాభాగ్యము. నానమ్మకము నాక్రియలలోఁ జూపించెదను.

యేసు — మంచిది. ఇఁక లెండు. సర్వేశ్వరునికి స్తోత్రముఁ జేయుదము

రాయప్ప — చిత్తము.

అందరుకీర్తనపాడుట.

1 వందనములు వందనములు. సుందరసర్వేశ్వర మా॥ వంద॥
డెందముయానందము పర దేశులము మముఁ గావుము యింక ॥వంద॥
2 నిజముగ నీధరలోపల నెమ్మదినినునమ్మెసియా॥
సుజనుల రక్షించెడి పితచూడుముమము ప్రోవుము మా॥ వం॥
3 సకల్పనలన్నియు మదినిల్పి యుఁ గాపాడెదమిఁదో॥
ప్రాకటయశసన్నుత పరిపాలక సర్వేశ్వర మా॥ వంద॥

అందఱు నిష్క్రమింతురు.

మూఁడవ రంగము.

The house of the High Priest.

(అనాసుఁడు కైపాసుఁడు)

అనాసుఁడు—సీ॥ అల్లుడ ! యిదియేమి • యతిశయకార్యంబు
రాజ్యమంతటఁ ప్రజల • రవులుకొనియె
జూదయ కులుఁడంట • చూడవద్రంగంట
జేసునాముఁడంట • శ్రేష్ఠుడంట
అవని విచిత్రమా • యద్భుతఁబులరాశి
జేసి జూదులనెల్ల • జెఱిచెనంట
స్తోత్రవేదముఁ దెచ్చి • గొనకొని శోధించి
శిష్యగణమూహంబు • జేర్చెనఁట
గీ॥ అతఁడు దేవుని పుత్రుఁడ • ననియు జూద
ప్రభువునంచును బహిరంగ • పలికెనంట
యతనివంచన మార్గంబు • నరయుమయ్య
గురులయతిశ్రేష్ఠ స్తుతిపాత్ర • చారునేత్ర.

కైపాసుఁడు—మామగారూ! మీరిందులకై భీతిఁ జెందుట నాకతిశయ ముగనున్నది. అతనివిషయమై యిదివరకే తగినకట్టుదిట్టములఁ జేసియున్నాను. ఎట్లనగా:

సీ॥ అందఱిఁ బిలిపించి యతనిని బంధింపఁ
ప్రజలకు బోధించి పంపినాను

అతనిదైవద్రోహ • మనలీలవివరించి
ప్రజలకుబోధించి • పంపినాను
అతనిరాజద్రోహ • మనలీలఁదెలియంగ
ప్రజలకుబోధించి • పంపినాను
అతనినిస్త్రీవషి • నమునఁగొట్టియుజంపఁ
ప్రజలకుబోధించి • పంపినాను
గీ॥ అతనిశిష్యుండు జూదానుఁ • డతనిపట్టి
నిచ్చెదనటంచు వాగ్దత్త • మిచ్చినాడు
వీరులగునట్టి భటులను • జేర్చినాను
ఆర్యసన్మాన్యశ్రీ జూద • గురుఁడగాన.

కావున మీరలింకకై చింతించుట శ్రేయస్కరము గాదు. నేను వనఁగా నెంత? అతని మంత్రప్రభావములు నాముందఱ సాగనేర్చునా? అత్యల్పకాలములో నతని దెబ్బెట్టించెద. మఱి చట్టప్రకారముననకసిఁదీర నతనిని హింసించి యతనిని వధియించుటకై దొరతనమువారి యాజ్ఞను సంపాదించెద. ఆఁమీఁదట స్త్రీవషి వాడియైన ముల్లుచేఁ గొట్టించి యమసదనమునఁ గంపించెద. (తలయెత్తిచూచి) ఆహా! మనయదృష్టము ఫలముఖమైనది. అదుగో జూదానుఁడు వచ్చుచున్నాఁడు. త్వరఁగామన కార్యములన్నియు నెఱవేఱఁగలవు. అతనిను ఖచిహ్నముల నవలోకింప శుభమును సూచించుచున్నది.

జూదానుఁడు—(ప్రవేశించి) ఆచార్యులారా! నమస్కారములు.

అనానుఁడు—మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

కైపాను—కం॥ మెచ్చితి నీసుగుణంబుల
మెచ్చితి నీస్వామిభక్తి • మేదినిలోనఁ
యిచ్చెద బహుమానంబుల
దెచ్చితివా! జేసుయునికి • దెరుఁగ నెల్లన్.

జూదాను—ఆచార్యా! మీయాజ్ఞను శిరసావహించి జేసునాధుని సన్నిధానమునకరిగి యతనివర్తనమనలీల గ్రహించి మీ సముఖమున కేతెంచితిని. అతఁడు తిన్నఁగ శిష్యసమేతము చేద్రోను వంక కావలిభాగమున కేగుచున్నాఁడు. నేఁడు వాఱలందఱు నచ్చ

టనే యుండును. మనము చక్కగా నచ్చటకేగినచో నతఁడు మన హస్తగతుఁడగుట వాస్తవము.

కైపాసు—మామగారూ! ఇఁక నాలస్యముఁ జేయుట శ్రేయోదాయకము కాదు. మన మిప్పుడే తప్పక జూదాసుని వెంట మనవీరులఁ బంపవలెను.

అనాసు—"ఆలస్యమమృతం విషము" న్నట్లిఁక కాలయాపనము చేయుట సమంజసము కాదు. ఇప్పుడె తప్పక మన చతురంగసైన్యము నితనివెంట బంపుఁడు.

కైపాసు—చిత్తము (జూదాసునివంకఁ జూచి) జూదాసుఁడా! గాఢాంధకారమయమైన నీసమయమున నిన్నునమ్మి నా చతురంగబలమును నీ వెంట బంపుచున్నాను. నీవు మాయందు విశ్వాసముగలవాడవై ద్రోహితలంపులఁ జొరనివ్వక మాగురువును మాసైన్యమున కప్పగింపుము.

జూదాసు—ఆచార్యా! మీరు నాయందేమాత్రము సందేహము నొందకుఁడు. మీవారికావంతయు నలసటగలుఁగనీయక మాగురువైన జేసునాథు నప్పగించెద. అప్పుడుగాని నావిశ్వాసము నాచమత్కారము మీకు బోధకానేరదు.

కైపాసు—పరమసంతోషము. మిత్రుఁడా! నీకిదివరకిచ్చిన బహుమాన మొకలెక్కలోనిదిగాదు, నన్ను నమ్మి నాకార్యము నెగ్గించిన నిన్నుంబెద్దఁజేసెద.

జూదానుడు—చిత్తము, (అని అందరు నిష్క్రమించుట.)

నాలుగవ రంగము.

Christ's Last discourse to His Apostles.

జేసునాథుఁడు—సహోదరులారా! మిమ్ముల నందరి నీపుడమిపై విడచి నేను పరలోకమున కేగు సమయము సమీపించినది. కావున మీకొక యపూర్వకరమైన నాజ్ఞనొసఁగ దలఁచియున్నవాడ. దానిని సావధానముగా నాలకింపుడు. నేటినుండి మీరందఱు నేకమనసుఁగలిగి కపటరహితులై యన్యోన్యముగా స్నేహించు

కొందురుగాక" ఇదియె నాకల్పన లన్నిటిలో నూతనకట్టడయై యున్నది.

ఆ॥ వె॥ శిష్యులార! నేను శీఘ్రుంబె • మిము బాసి
వెళ్ళువాడ మీరు • వెతలఁబడక
సంతసమున మెలఁగి • సర్వేశుకరుణకై
వేఁడుకొనుఁడు నెపుఁడు • వేగిరముగ.

శిష్యులారా! నేననతికాలమున పరమండలమున కెక్కఁబోవుచున్నానని మీ స్వాంతములు నావంకయుఁ జింతింపకుఁడు. నేను పితృసన్నిధానమున కరిగి యచ్చట మీకరస్థానంబులఁ బొందుపఱచి మిమ్ములఁ దీసికొని పోయెదను. మీనైకమత్యము నాచంద్రతారార్కస్థాయియై ప్రజ్వలించుటకు మా పితను ప్రార్థించెదను. మీకు సమస్తము నేర్పించుటకై స్పిరితుసాంక్తువును పంపించెదను. నేను మార్గమును సత్యమును జీవమునై యున్నాను. పితయొద్దకు రాఁగోరిన ప్రతివాఁడును నాద్వారా రావలసినదే కాని వేరుమార్గము లేదు.

—• ప్రార్థన. •—

సీ॥ సర్వేశ నీపుత్రుసముదాయము • చనుదెంచెఁ
ప్రఖ్యాతి కెక్కంవ • వయ్య తండ్రి
నీయాజ్ఞఁ జేకొంటి • నీచిత్తసంకల్ప
మీడేర్చుచున్నాను • యిలను తండ్రి
ఈ శిష్యసముదాయ • మిందఱు నీవారె
పరిశుద్ధపఱచుము • పరమతండ్రి
వీరంత బోధించు • వేదముఁ జేకొను
వారలఁ గాపాడ • వలెను తండ్రి
గీ॥ మనము నిరువుర మేకమై • మనసుఁగలసి
వరలు విధమున వీరంత • వరలి యైక
మత్యమను పుణ్యసంపాద • మవనియందు
నిలువఁ జేయుము నేప్రొద్దు • నిలచి తండ్రి॥

పుత్రులారా! శ్రీపితయైన సర్వేశ్వరుని కనికరమపారముగా

సంపాదింతురుగాక. మీకొసఁగిన నూతనకట్టడ నత్యవసరముగాఁ గాపాడు కొనుదురుగాక.

రాయప్ప—ఏలినవారా! మీ క్రొత్తకట్టడను మేమందరము నదాకాపా డుకోఁగలము. దానిని ప్రీతిపూర్వకముగాఁ జేకొనుచున్నాము. అతిత్వరఁగా నాచరణకుఁ దెచ్చెదము. మీకరుణకుఁ బాత్రుల మయ్యెదము.

జేసు - మంచిది. మనమందరము ఒలీవేతుపర్వతప్రాంతమున కేగుట యత్యవసరము.

రాయప్ప—(ఇప్పుడే మీ యాజ్ఞ్యనుసార నేగుదమురండు.)

(అందరు నిష్క్రమింతురు.)

పిశాచము ప్రవేశించుట (ఇదివిష్కంభము)

నృత్యము.

ఇదిమంచి సమాయమిదినాకు - నే- వదలజాల ॥ఇది॥

1 చిన్నతనంబుననుండి జేసువుకు - కన్నులఁజూచియు నోర్వజాలకఁ బన్నితినెన్నికొంపన్నుగడలునా-కన్నియునూన్యములయ్యెవప్పుడవి॥ఇది॥

2 నన్నునమ్మి యాజూదులందఱికి - నెన్నికఁ జేయుచు సత్యవేదమును సున్నితముగఁబోధింపఁగలహాములు-జొన్పివిరోధముఁబెంచితినిప్పుడు॥ఇది॥

(నవ్వి) ఆహాహాహా! నా సంతోషము నేనేవర్ణించుకోజాలకున్నాను జేసునాథుఁడు నాఁడు యరణ్యమునఁ దపమాచరించినప్పుఁ డెంతోమో శోధింతినిగాని యప్పుడు నావలలోఁ బడకఁబోయెను. అప్పటినుంచి యతనిపైఁ నాకుఁగల సమాయ నాహృదయమునఁ బదిలపఱచుకొని ప్రథమాచార్యులైన అనాసుకైపాసుల నావశముఁ గావించుకొనితిన్నఁగ జూదులకుబోధించి యతనిపై విరోధము గలిగించినందున యిప్పుఁడు నాప్రయత్నములన్నియు ఫలముఖములైనవి. జేసునాథుని శిష్యుఁడైన జూదాసుకు మనోవైకల్యముఁ గలిగించి స్వామిద్రోహమునకు నలవార్చితిని. ఇప్పుఁడతఁడు నాకుదాసుఁడై యున్నాఁడు. ఇఁక జేసువెట్లు దప్పించు కొనునోఁ జూడవలయును?

ఇఁకనాకోరిక సిద్ధించుట నిశ్చయము. ఈజూదులందఱి నొక్క త్రోవకుఁ దెచ్చేవఱకు నాపెద్దలు దిగివచ్చిరి. ఈనభారంగమున నాదాసు

లనేకులుండియున్నారు. వారలెంతమాత్రము భయపడవలసిన యవసరము లేదు. వారిమరణపర్యంత మొక్క కొఱఁతకలుగనివ్వకఁ గాపాడెదను. తరువాతనా? నేఁజెప్పనవసరములేకయే మీరు గ్రహింపవచ్చును. అచ్చట నాదానుంద్రనిమిత్తమై ఆరని అగ్నితో నరకము ప్రజ్వరిల్లుచున్నది. అది దుర్గంధముల కాటపట్టు. దానిలో మావారలనందఱిఁ జేర్చి బహూకరించెదను. అప్పుఁడు కాని నా ప్రభుత్వముయొక్క మహాత్మ్యముఁ బోధపడదు (నవ్వి) అహాహా నా దెబ్బయిఁకఁదప్పునా ? తప్పదు తప్పదు ముమ్మాటికిఁ దప్పదు. (అని నిష్క్రమించును.)

## అయిదవ రంగము

## Jesus in the Garden of Gethseman· and delivered up to His enemies.

(జేసునాథుఁడు ముగ్గురు శిష్యులు ప్రవేశించుట)

జేసునాథు—సహోదరులారా ! ఇప్పుఁడు నాయాత్మ మరణసాగరమున మునిఁగియున్నందున మీరందఱు మెలఁకువగా నుండుఁడు. ఎడఁతెగక సర్వేశ్వరునిఁ బ్రార్థింపుఁడు. సైతాను శోధనలోఁజిక్కకుఁడు.

(జేసువు కొంచెము దూరము వెళ్ళి)

ఉ॥ శ్రీకర దేవదేవ ననుఁ • జేరిన చేఁదగు పానపాత్రముల్
నీకుఁదమారసంబుఁగల • దేనిఁ దొలంగఁగఁ జేయుమయ్య నీ
ప్రాకటమైనకీర్తిభువిఁ • ప్రాభవమానుఁగదయ్య నింతలో
నాకువిచారమేమి? మది • నాఁగలకోరిక నీదు చిత్తమా.

పితయైనసర్వేశ్వరా! మీచిత్తము నాపైనెఱవేరునుగాక

(శిష్యులవైపుఁజూచి వారిదగ్గరికివచ్చి)

కీర్తన

1 అకటా శిష్యులారా - హా మిత్రవరులార
ఇఁకలెండుయిఁకలెండు - యిదిమీకుఁదగునా? ॥అకటా॥
2 లెండులెండుమీరు - లేచిసర్వేశ్వరుని
నిండుహృదయంబున - నిలచిప్రార్థింపుఁడు ॥అకటా॥

3 సైతానుశోధన - జయమంగళవలెగాని
హింసవుగనిద్రింప - నిదిమీకుఁదగునా? ॥అకటా॥

సహోదరులారా! మనవిరోధియైన సైతానుఁ జింతలో నాయాజ్ఞను మఱవఁజేసెనా? అదిగోఁ సైతానుమీకై కాచియున్నాఁడు. ఇఁకనైనఁ జాగరూకులై సర్వేశ్వరునిఁ బ్రార్థింపుఁడు,

(యేసునాథుఁడు దూరముగావెళ్లి)

ఉ॥ శ్రీకర దేవదేవనుఁ • జేరినచేరగుపాపపాత్రమా
నీకుదయారసంబుఁగల • దేనిఁ దొలంగఁగఁజేయుమయ్య నీ
ప్రాకటమైనకీర్తి భువి • ప్రాభవమానఁగదయ్య కింతలో
నాకువిచారమేమి? మది • నాఁగఁ గోరిక నీమది స్తవమా.

సన్మనస్కు—(ప్రవేశించి) లోకనాథుఁడవైన యేసునాయకా! స్వాగతము లాచరించుచున్నాను.

యేసు — దేవదూతకభివాదముఁ జేయుచున్నాను.

సన్మనస్కుఁడు—లోకరక్షకా!

సీ॥ శ్రీపితయాజ్ఞలఁ • జేకొన్నచరితంబు
యురుతరంబుగ నీవు • మఱచినావ
నరులనురక్షింప • నరుఁడవై జన్మించి
మరణమొందెదనుమాట • మఱచినావ
పరిజేయుజనులచేఁ • బరిహాసకరమైన
మరణమొందుటనీవు • మఱచినావ
అవనిందెలకుమూల • మైన చెట్టుపైనివ
మరణమొందుటనీవు • మఱచినావ
గీ॥ అన్నిఁదెలిసియు నీరీతి • నలసిసొలసి
దుఃఖమొందుట శిష్యులఁ • దూరవడుపఁ
దోచకున్నదియోచింప • దుష్టశిక్ష
ఆదిసర్వేశసత్పుత్ర • యాత్మనేత్ర!

జన్మపాపదోషంబున నావరింపఁబడిన లోకంబునీచే రక్షింపఁబడనున్న సంగతినీకుఁ దెలియనిదికాదు. నిష్కారణముగా నిట్లువిలపించుటకుఁ గారణమేమి?

జేసు—నీవు దెలిపినవన్నియు సత్యములని నాకుఁ దెలియునివి కావు. నేను మనుజుల రక్షింప భూలోకమునకే తెంచి బలికావలసినది వాస్తవమే కాని నాకు మనుష్య స్వభావమున్నందున దుఃఖింపవలసి వచ్చినది. పితచిత్తసంకల్పము నెఱవేర్ప సిద్ధముగానున్నాను.

నన్మనను—దైవకుమారా! లోకరక్షణార్థమై కళంకరహితమైన గొఱ్ఱెపిల్లవలె బలియై మీ రక్తమునొసఁగవలసిన యవసరమున్నది. అత్యవసరముగా మోక్షద్వారమునుఁ దెఱువవలెను.

(అని అంతర్ధానమొందుట)

జేసు—(శిష్యులకొఱకు దిక్కువచ్చి) సహోదరులారా! లెండు లెండు. నిద్రించినంత వఱకుఁ జాలును నన్ను శత్రువులకు నొప్పగించెడి గురుద్రోహుఁడే తెంచుచున్నాడు.

శిష్యులు—(ముగ్గురు లేచి ఎక్కడ ఎక్కడనని చిందులు ద్రొక్కుట)

జూదాను—(ప్రవేశించి) గురువర్యా! నమస్కారములు (అని ఆలింగనము జేసికొనుట.)

జేసు—ఓరిమిత్రుఁడా! ఈలాటి స్వామిద్రోహము నీకెవరు నేర్పించిరి. ఆలింగనము జేసినన్ను నా శత్రువులకు నొప్పగించుచున్నావా? (తలనెత్తి) ఓ ప్రజలారా! మీరెవరిని వెదకుచున్నారు.

మాల్కను—మేము నజరేతూరి జేసువను వానిని వెదకుచున్నాము.

జేసు—నేనే (అనగానే అందఱు మూర్ఛిల్లుట.)

ఓపితమైన సర్వేశ్వరా!

ఆ॥ వె॥ నిన్ను మహిమపఱుప • నేను వచ్చితి ధాత్రి
నన్నుతింపనాదు • చరితమంత
జరుపుమయ్య వేగ • జగమందు సత్కరుణ
జూదజనుల లేపి • చూడుమయ్య.

ఓపరాక్రమశూరులారా! మీ పరాక్రమ మేమి జేసితిరి? నిష్కారణముగా మూర్ఛిల్లితిరేమి? లెండు లెండు మీ కోరిక నెఱవేర్చుకొనుఁడు. (అందరు లేయుట) బలశాలులారా! నన్ను మీరు దొంగవనిపట్టవచ్చితిరా? లేక నరహంతకుఁడనియెంచితిరా! ఇదిగో నేను మీ శివగోపులలో నివసించి నప్పుడు మీరు నన్నుఁ జూడలేదా! అప్పుడేమనుకొంటిరి? ఇప్పుడేమను

కొంటిరి? యదార్థమును దెలుపుఁడు.

జేసు — నీచమత్కారములన్నియు మాకుఁదెలియును. ఇఁకనీమాయకట్టి పెట్టుము. ఓరిభటులారా ! ఇతనిపట్టి కట్టి బంధించుడు.

జ్వాన్నేసు — ఓ శూరులారా! అపరాధరహితుండైన శ్రీ జేసునాధుని బట్టుటకుఁ గారణమేమి?

శిమియోను — ఓ వీరులారా! తపోవ్రతశీలుండైన లోకరక్షకుని నిష్కారణముగాఁ బంధించుటకు గారణమేమి?

రాయప్ప — (పైఁబడి) అరెరే! భటులారా! మీకన్నులకుఁ బొరలెక్కియున్నాయుక్త జ్ఞానవిహీనులై మాగురురాయునిపట్టి కట్టి బంధించుచున్నారా? ఇదియేమి యన్యాయము! చండాలులారా! మారక్షకునిపై యపరాధముఁ జూపించనిచో మిమ్ములనందఱి నాకరవాలమున కెరజేసెద. (మాల్కుసును బట్టుకొని) ఏమిరా మండ! మాగురువుపైఁ దప్పిదము జూపించెదవా! లేదా

మాల్కుసు — ఓరీ తుంటరి! జనకంతకుఁడైన మీగురువును బట్టితిని. తప్పిద మొకటి గావలయునా! విఁడువు విఁడువు. విఁడువకున్న నీకుత్తుకఁ గోసెద.

రాయ — కోసెదవా? చావు ముండకొడక. (మాల్కుసును నరుకుట వ్రేటుతప్పి చెవిఁ దెగుట.)

జేసునా — రాయప్పా!

సీ॥ గురువాజ్ఞనొందక • క్రూరులఖండింప
దగునెనా ప్రియశిష్య • ధర్మమగున
నిన్న మొన్నటియాజ్ఞ • నిలువకనీరీతి
వర్తించిజవదాట • వలనుపడునె
శ్రీపితచిత్తంబు • జెఱుపనూహించుట
గడఁగిరొూచింపంగ • ఘనతయగునె
నాకుఁగోరికయున్న • నాతండ్రియమితమౌ
సైన్యంబునంపడా? • చతురవినర

గీ॥ నన్నుగురియించివ్రాసిన • చిన్నెలన్ని
పొల్లుఁబోకుండఁ జెల్లించి • పుడమియడల

దీర్ఘదర్శుల లిఖితముల్ • దేటపఱచ
వలెనునీకత్తి వేయుము • వరలోవేగ.

కావున నీయాగ్రహమును నిగ్రహించి నీఖడ్గమును పదిలపఱచుము ఎందుకనగా కత్తిఁ బట్టుకొనినవాడు కత్తితోనే నశించును కావున దైవ సంకల్పము నొరదట్టుట శ్రేయస్కరముగాదు. (మాల్కునుని జూచి) వ్యాధి పతీ! నీచెవిఁ దెగినందులకై చింతింపకుము. నీచెవి నతికించి నీకు సౌఖ్యంబుఁ బ్రసాదించెద. (అని చెవినతికి) ఇఁకసంతోషింపుము నీకునట్టి హానియుఁగలుగకుండ నేను నీవెంటవచ్చెదను.

మాల్కు—పదపద ఇటువంటి విన్నియింద్రజాలములు లేనిదే నీకొత్తమతమును రాజ్యమంతట బోధించి యంతఃకలహములఁ గలిగింప సాహసించితివా! నీకుసాహసోదారగుణములు స్వాభావికంబులు. భటులారా! చూచెదరేమి? ఇతనిమాయాజాలముల కచ్చెరువొందకనిప్పుడె నావెంట నీడ్చుకరండు.

భటులు—చిత్తము (అని వెళ్ళుట)

Jesus before the High priest.

ఆరవరంగము.

కైపాను మందిరము.

కైపాను—ఆహా! నేటికి నాయభీష్టము నెఱవేరుచున్నది. జూదానుఁడు నావలలోఁ జిక్కుటచే జేసునాథుఁడు నాచెయిజిక్క సంప్రాప్తించెను. జూదానుఁ డిచ్చిన వాగ్దత్తము నెఱవేర్పఁజాలినవాఁడు. రాజ్యములఁ దలక్రిందులఁ జేయఁజాలిన ధనమూలమునఁగాని కార్యము లేమున్నవి? అతఁడు ధనాపేక్షుఁడగుటచే గురుద్రోహమను శంకయైనను దలంపక నతని గురువైన జేసునాథుని నాకుఁ బట్టియిచ్చుటకు నాచతురంగబలముఁదీసికొని వెళ్ళెను. అతఁడు తప్పక పట్టియిచ్చును. (తలనెత్తిచూచి) భేష్. నాకు మనశ్శాంతిఁ గలిగెను. నాసైన్య మతనిని పెడరెక్కలు విఱచికట్టి యీడ్చుక వచ్చుచున్నారు. నామామగారైన అనానుని గృహమున కేగియుం

దురా? జేసునాథుని హింసించి యవమానకరమైన మరణశిక్ష విధిం
చుటకు సమ్మతించియుండెనా? (అందరు వచ్చుట)

మాల్కసుఁడు—ఆచార్యా! పదివేల నమస్కారములు.

కైపాసు—శుభమగునుగాక.

మాల్కసు—మహాత్మా! దేవరివారి యాజ్ఞను శిరసావహించి మేమం
దరము మాప్రాణములపై నాశఁ ద్యజించి నాఁటిరాత్రి గాఢాంధ
కారముచే నావరింపఁబడిన ఒలివేతుపర్వత ప్రాంతమున నీడొంగ
గురువును బట్టికొంటిమి. ఆకటికి చీకఁటియందు నితని ప్రధాన
శిష్యుఁడు నాఁతోఁ గలహించి నాఁజెవినటికి నన్ను నంగహీనునిఁ
గావింప నితఁడు గద్దించి నాఁజెవి నతికించి నాకు స్వస్థముఁ గావిం
చెను. ఆహా! ఇతని మంత్రప్రభావము వర్ణింప నలవిఁగాదు.

కైపాసు—మాల్కసా! ఇతని మంత్రబలమేగదా? మన ప్రజల నావ
రించి సంఘీభావమునుఁ జెఱచినది, ఇతఁడు మన్నింపఁదగినవాడు
గాడు ఇతని మామామగారికిఁ జూపించితిరా? వారేమనిరి?

మాల్కసు— చూపించితిమి. వారు మీసామర్థ్యమును శ్లాఘించిరి.
ఇతనిని శిక్షించుటకభిలషించిరి. ఇదిగో! వారు మీకిచ్చిన నిరూ
పము. (అని వుత్తరము నిచ్చుట)

కైపాసు—

సీ॥ కాఱుమబ్బులలోనఁ • గటికిచీకఁటియందు
వీఁడువక మనవార • లేగినారు
ఈజేసు వొనరించు • వింతల మదిలోనఁ
దెలిసియు బంధించి • తెచ్చినారు
జూదయు లందఱు • శుభముగాఁ జేకొన్న
గురువును మనచెంతఁ • జేర్చినారు
జూదానుడవలీల • సుమతుఁడై నాచార్యు
నింపుగా మన కప్ప • గించినాఁడు
గీ॥ ఉరుతరంబుగ నతని • బహూకరించి
తగిన బహుమతు లర్పించి • తర్లఁజేసి
జేసునాథుని హింసించి • శ్లీవమరణ

యాజ్ఞనొసఁగుము నీప్రొద్దు • యార్యవర్య.

(అని చదివి) పరమసంతోషము. భటులారా! ఇతనిని విచారించుట యావసరము. మనవేదపాఠకులఁ బ్రవేశపెట్టుఁడు.

భటుఁడు—(వెళ్లుట)

వేదపాఠ—(ప్రవేశించి) ఆచార్యా! నమస్కారములు.

కైపాసుఁడు—మనోవాంఛా ఫలసిద్ధిరస్తు. వేదపాఠకులారా! ఈదొంగ గురువు నవలోకించితిరా?

వేదపా—అవలోకించుచున్నాము. ఇతఁడు నిజముగా దొంగగురువు గానే చూపట్టుచున్నాఁడు. ఇతనివేషము నహా నందుల కనుకూలముగానే యున్నది. ఇతఁడు ప్రపంచమున కసహ్యుఁడుగఁ గన్పడుచున్నాఁడు.

కైపాసుఁడు—ఓరి జేసువనువాఁడా? నీసంచారమేమిటి? నీక్రొత్తమతము నెచ్చటఁ గొనితెచ్చితివి. నీశిష్యులనెక్కడ సంపాదించితివి.

కం॥ సందులఁ గొందులఁ దిరుగుచు
నెందులకీక్రొత్తమతము • నీచుజనులకున్
డెందములఁ గందఁ గలహము
లెందుకుఁ బుట్టించినావొ • యోఁగింపుమిఁకన్.

జేసునాథుఁడు—ఆచార్యులారా! నాచే బోధింపఁబడు సత్యవేదము సందులగొందులలోఁ బ్రకటించియుండలేదు. బహిరంగముగా సినగోగులయందును సభారంగములయందు నుపన్యసించుచుంటిని. మీలో నన్ను నెఱుఁగనివారెవరు?

కం॥ తలచితిరే సభలందును
సలలితముగ గుళ్ళయందు • సందశివేళన్
నిలచితిని సత్యవేదము
పలువిధములఁ బోధఁజేయు • పట్టున మీరల్.

మాల్కు—ఓరి గురుద్రోహుండా! ఇచ్చట నీయిచ్చవచ్చి నట్లుపన్యసించు స్థలముగాదు. ఛీ ఛీ నోరుమూయుము (అని చెంపన గొట్టుట.)

వేద—మహాత్మా! ఈజేసువు సామాన్య మానవమాత్రుఁడుకాఁడు.

ఇతఁడు ప్రసంగించునపుడంతయు, నేను దేవునికుమారుఁడనని యతిసాహసముగఁ జెప్పుకొనుచుండెను, అందువలన నితఁడు దైవద్రోహుఁడని నిర్ణయింపబడెను. యూదుల రాజునని ప్రకటించుకున్నందున రాజద్రోహుఁడయ్యెను.

కైపాను—ఓరి క్రీస్తునాథుఁడా! ఈసంఘమునఁగల పెద్దలయభిప్రాయము నాకర్ణించితివా? ఇందులకే మనెదవు?

జేసునాథు—(మౌనముగా నుండుట)

కైపానుఁడు—ఓరి జేసునాథుఁడా! నిన్ను జీవితసర్వేశ్వరుని తోడని యాన బెట్టి యడుగుచున్నాను. నిశ్చయముగా నీవు దేవుని కుమారుఁడవైన క్రీస్తునాథుఁడవేనా?

జేసు—అందులో నసత్యమేమున్నది. నేను సర్వేశ్వరుని కుమారుఁడనైన క్రీస్తునాథుడనని మీరే చెప్పుచున్నారుగదా! నేను సర్వేశ్వరుని కుడిపార్శ్వమునఁ గూర్చుండుటయు, మేఘాసనాసీనుఁడనై వేంచేయుటయు మీరు జూడఁగలరు.

కీర్తన

కైపాను— ఎందుకోయి నీ - కింత బడాయి
ఇందరిలో సర్వేశసుతుడనని డెందమేరఁగఁ జెప్పెదవుబళా॥ ఎం॥
2 వద్దువాడా యీ జిడుతినమేల
అద్దిచేయక దైవద్రోహము - నందరిలో వెలిబుచ్చెదవుబళా॥ ఎం॥
3 వెడఁగువాడా - యీ వేషమదియేల
గడుసుగుణములుఁ జూపి క్రౌర్యము గాంచనెంచితివాబళా॥ ఎం॥

మహాత్ములారా! ఇతని కాఱుకూతలాకర్ణించితిరా? ఓరి దైవద్రోహి! ఈ ప్రసంగమిచ్చుట నభ్యసించితివి?

ఆచార్యా! ఇతఁడిప్పుడు బహిరంగముగా దేవుని కుమారుఁడనని చెప్పుకున్నాడు. ఈ ముక్క వేదచట్టమునకు విరుద్ధముగా నున్నది. కావున మీయభిప్రాయమేమి?

వేదపాఠకులు—ఇందువలన నితఁడు దైవద్రోహిగఁ బరిగణింపబడెను. చిత్రహింసలతోఁగూడిన మరణదండన నితనికి విధింపవలెను.

వేద—ఇతఁడు భూదేవికి భారముగానున్నాడు. ముమ్మాటి కితనిఁజంపుట

శ్రేయస్కరము.

శైవానుఁడు—మంచిది భటులారా! ఇతని నేటిరాత్రి మీకసిదీర హింసింపుఁడు.

భటు—చిత్తము. (అందరు నిష్క్రమించుట)

గద్యము.

ఇది శ్రీజేనునాథ వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర రేచర్లగోత్ర పవిత్ర
గంజి యున్నారెడ్డిపుత్ర బాలశౌరిరెడ్డి నామధేయప్రణీతం
బైన శ్రీమృత్యుంజయ నాటకమున

ప్రథమాంకము

సంపూర్ణము.



శ్రీ

# మృత్యుంజయనాటకము.

## ద్వితీయాంకము

(విష్కంభము) సైతాను ప్రవేశము.

సైతాను:—ఆహాహాహ్హాహ్హాహ్హా (అని నవ్వి) జూదయ శిఖామణులారా! చూచితిరా! నాప్రభావము. లోకనాథుండైన జేసునాథునిపై కొందరి జూదులఁ బురికొల్పి చోరునికైవడిఁ గట్టించి చిత్రహింసలపాలు జేసితిని ఇప్పుడు మీరందఱు నాదాసులైయున్నారు. వారలందఱిని కొయ్యబొమ్మలలాగు నాఁడించుచున్నాను. ఇఁక జేసునాథునిఁ బెట్టెఁడు పాట్లను మీరందఱుకన్నులవండువుగాఁ జూడవచ్చును. హెచ్చరిక. మీరు జేసునాథుని సువిశేషమును విశ్వసించేరుసుమీ! విశ్వసించితిరా! మీపాట్లుఁ జెప్పతరముగాదు. ప్రియులారా నాదాసకోటి కమిత సౌఖ్యములఁ జేకూర్చెదను. జేసునియందు భక్తిగలవారికి లెక్కింపరాని చిత్తసంక్షోభమును దెచ్చిపెట్టెదను. త్వరపడుఁడు. నాఁదాసకోటిలోఁ జేరుఁడు. అయితేమహానుభావులారా! మీరుశరీరమునువదలి పరలోకమునకుజేరినతర్వాత నాప్రభుత్వముయొక్క రుచి మీరుచక్కఁగాఁ జూడఁగలరు. అప్పుఁడు మిమ్ములను దుర్గంధమైననరకమునకు బంపించెదను. అది మహాభయంకరమైనది. అచ్చట నైసర్గికయనలము నల్లుకొనియుండును. అదిదుర్గంధమున కాలవాలము. కరిగిన సీసమచ్చట సముద్రమువలెఁ బొంగుచుండును. ఆహా! అంతక్షేమకరమైన స్థలమునొసఁగి మిమ్ముబహూకరించెదను.

సీ॥ పరస్త్రీలఁబొందెడి • పాపిష్ఠులనుబట్టి
యనలంబులోవల • నదుము వాఁడ
పరవిత్తముల కాన • బడిన దుర్మార్గుల
సీసమంతయు గుక్కఁ • జేర్చువాఁడ

దబ్బరలాడెడి • దానహీనులఁబట్టి
కఱకు గొద్దండ్రతో • నఱుకువాఁడ
చాడికొండెములాడు • చండాలురనుబట్టి
నోటిలోపల నిప్పు • నునుపువాఁడ
గీ॥ దీన జనులను నేపొద్దు • దెగఁడువాని
నాలుకనుఁగోసిఁ జూపించి • నవ్వువాఁడ
జేరినమ్మినవారిఁ • జెఱుచువాని
జెరలఁదీయించి ముదమారఁ • జెండువాఁడ.

అపయోకాల నసత్య దేవతల నారాధించిసత్యమును నిరాకరించెడి వందల జంతఁబెఱికలతో బహూకరించెదను. అబ్బబ్బా! నాప్రశస్త్యమును వర్ణింప నాకలవిగాదు. తదితరులకేమి యలవగును? నాపరిపాలనమంతయు వివరించి మీకుపన్యసించినచో నాకు లోటుసంభవించును. మరియు మీకుభీతిజనింపవచ్చును. మీఅందఱు నాయందు చిరకాలము విశ్వాసము స్థాయిభావముఁ జేసికొన్నచోఁ బైనుదహరించిన బహుమతుల నందజేసెదను.

ఓనాఁదాసులారా! సందేహించేరుసుమా? ఇప్పుఁడా జూదానుసిజూడుఁడు. కేవలమతఁడు నాప్రథమశిష్యుఁడైయున్నాఁడు అతఁడుముందునాతో కలకాలము బహూకరింపఁబడును ప్రజలారా! మీమూఢముని నేకదానాకీ నరకాధిపత్యమువచ్చినది? కలకాలము భయంకరమైన నరకాగ్నియందు దహింపబడుచున్నాను. మిమ్ముల విడచెదననుకొంటిరా? ఒక్కనాటికిని విడువను. నేనుకలకాలము దుఃఖించుచుండ మీరు సంతోషించెదరా? జాగ్రత. మీయంతరాత్మ నాశించెడి యహంకారుఁడనేనని తలంపవలయును. తలపరా నాకుమీరు శిష్యులుకానేరరు. జాగ్రత!

## మొదటి రంగము. Persecution of Christ

### (జేసునాధుని హింసించుట)

1 సేవకుఁడు—ఓరివడ్లవానికుమారుడా! జేసువనువాఁడా! ఈగురుత్వము నెంతకాలమునుండి యాలోచించి సంపాదించితివి? నీచేతలవలోకింప వ్యాఘ్రమునుదాచి జంబుకము వాతలఁబెట్టుకున్నట్లున్నది. నీకి

యుపాయము నభ్యాసమొనరించినవా రెవరు?

2 సేవకుఁడు—ఓరీ చండాలుఁడా! ఇప్పుడు నీవు నిజముగానే మా పెద్ద గురువువలెనున్నావు. పెద్దపోకలు పోవుట చేతనే గదా! ఇప్పుడు నీవంటికి సున్నము వచ్చినది?

1 సేవకుఁడు—ఓరిచాండస్సుఁడా! మన కింతమంది పెద్దగురువు లుండఁగా నీకేమిపోవుకాలము వచ్చి యీ వేషమును వేసితివిరా! ఇఁక చూఁడుము నీపాట్లు. (అని కన్నులకు గుడ్డకట్టుట ఒకతన్ను తన్ని) నేనొక పెద్దగురువునని చెప్పుకుంటివా? మంద.

2 సేవకుఁడు—(చెంపలు వేసి) ఓరీ స్వయంగురువా? ఇప్పుడు నిన్ను కొట్టిన వారెవరో తెల్పుము నీవు దేవుని పుత్రుఁడవైన క్రీస్తునాథుఁడవే గదా? ఇంతమాత్రము నీకు దెలియదా?

1 సేవకుఁడు—ఓరిడంబక్రీస్తువా? (అని తన్ని) నిన్ను తన్నినవా రెవరురా?

2 సేవకుఁడు—ఓరీ జూదుల రాజా! నీవు ప్రభువై యుండియు నిన్ను హింసించెడి మమ్ము శిక్షింపవేల?

1 సేవకుఁడు—తూ (అని వుమిసి) ఓరీ ప్రభువైనందుననే ఇటువంటి ప్రభుత్వమును సంపాదింపఁగలిగెను. (అని గుద్దుట)

2 సేవకుఁడు—ఏమిరా? దేవునికుమారుఁడా! పలుకవేమిరా? ఒక ప్రశ్నకైనను ప్రత్యుత్తరమివ్వవేమిరా? నీకు నోరులేదా ఏమిరా? మూఁగవాఁడవా?

Peter denies Jesus

రాయప్పగారు సేవకులు కొంచెము దూరమున మంటవద్ద

3 సేవకుఁడు— అరెరె! వీఁడెవఁడు? (అని యోగాదిగ జూచి) ఇతఁడు మన దొంగగురువు శిష్యుఁడుగాఁ గనుఁబడుచున్నాఁడు. ఇతనిని నేను ఒలివేతుపర్వత పరిసరమునఁ జూచితిని.

4 సేవకురాలు—అవునవును. ఇతఁడా కపటగురుని వెంటనున్నవాఁడే! యీతని శిష్యుఁడే!

3 సేవకురాలు —ఓరిమనిషీ! నీవు జేసునాథుఁడను గురువునకు శిష్యుఁడవేనా?

రాయప్ప—(తొట్రుపడి) ఆఁ (అని వెర్రిచూపుఁజూచి) అయ్యలారా! అతఁడెవరో నేనెఱుఁగను. (కోడికూయుట)

4 సేవకురాలు—లేదులేదు. నిజముగా నీవాతని శిష్యుఁడవే! నేనునిన్ను గుర్తించినాను.

రాయప్ప—దేవునితోఁడు. నీతోఁడు, నన్ను జంపకున్నట్లే. నే నతని నెఱుఁగను.

3 సేవకురాలు—మిత్రుఁడా! ఇతఁడబద్ధము లాడుచున్నాఁడు. ఒలివేతు ప్రాంతమున నితని బాగుగా గుర్తించినాను. వీడన్ని ప్రమాణములఁ జేసినను విశ్వసింపఁదగినవిగావు. ముమ్మాటికి వాని శిష్యుఁడే!

రాయప్ప—అయ్యలారా! నాప్రమాణముల విశ్వసింపరా?

(అనేవరకు కోడికూయుట జేసువు చూచుట)

(అందఱు నిష్క్రమించుట)

రాయప్పగారు ప్రవేశించుట.

Peter alone thinking of his sin

కీర్తన.

1 ఎంతమోసపోతినిరా, యేసునాధుని ద్రోహినై ఎంత॥
వంతముగ నేకల్లలాడి - పామరుండనైతిని ॥ఎంత॥

2 నేనుబోయెడు స్థలమునకు - నీవు రావని తెలుపఁగాఁ
మేనునైనా నిచ్చితుదకు - మిమ్ము విడువనంటిని ॥ఎంత॥

3 ధరను బాలాశౌరి యాఖ్యని గొఱతదీర్చి ప్రోచెడి
మరియసుతుని కరుణారసము - మరవదర మేనాటికి ॥ఎంత॥

అకటా! నాపాదిత్య మపారమైనది. ఇటువంటి సహింపరాని పాతకమును నేను సంపాదించుకొన్నను, దానిని లెక్కింపక నారక్షకుఁడైన జేసునాథుఁడు తనకృపారసము వెల్లువలై పార, తమ దివ్యదృష్టిని నాపైఁబారఁజేసి నాయజ్ఞానపటలమును హరణముఁజేసిరి. నాపాదిత్యము నేను గ్రహింపఁజాలితిని. శ్రీ వారితో నేనాడినవన్నియు వట్టి ప్రగల్భము లయ్యెను. ఒక్కటియైనను నిర్వహింపఁజాలకపోతిని. నేను వారిదీర్ఘదర్శనమును నెఱవేర్చిన వాఁడనైతిని. ఇప్పుఁడు నాగుండెయు లవియుచున్నవి. నాపరితాప మపారమైనది. నాద్రోహమును వర్ణింపఁజాలనిదియైయున్నది. క్రూరులైన జూదులు జేసునాథుని హింసించెడి హింసలఁ జూచి తొట్రు

పడి యీలాటికల్లలనాడితిని. గురుద్రోహుఁడనైతిని. తండ్రీ! నాయుల్లము తల్లడిల్లుచున్నది. సర్వజనరక్షకా! నన్ను సంరక్షింపుము. నాపాదిత్యమును క్షమించుము.

సీ॥ పరలోకమునుదాటి•పరతెంచి భూలోక
వాసులరక్షించు•వంశనీయ
మరియపుత్రుఁడవంచు•మహిమీఁదఁదిరుఁగుచు
వేదము జాటించు•వేదవేద్య
మనుజులపాదిత్య•మును బాపి మోక్షంబు
నొసఁగ నేతెంచిన•యుజ్వలాంగ
జూదుఁ క్రౌర్యంబు•జూచిసహించెడి
దుష్టజనశిక్షణ•శిష్టరక్ష
గీ॥ అట్టి పిశాచికి దాసుఁడ•నైతి నేఁడు
యెటులఁ నిన్నెఁ జుగనే•నెటుఁగ ననుచు
కల్లలాడితి మన్నించి•యుల్లమందు
దయతో రక్షింపఁగదవయ్య•ధన్యచరిత.
(అని నిష్క్రమించుట)

రెండవరంగము.

The High priest sending Christ to Pilate & Despair of Judas

ప్రధమాచార్యులు. వేదపాఠకులు దర్బారు.

(జేసునాధుని పెడరెక్కలు విఱిగిగట్టి నిలువబెట్టుట)

కైపాసు—సభాసదులారా!

క॥ చూచితిర దేవకుమరునిఁ
జూచితిరె కపటగురువును - చోద్యతమీరన్
జూచితిరె జూదరాజును
చూచితిరె జేసువనియెడు - శుభచారిత్రున్.

ప్రధమా—అహా! కన్నులపండువుగాఁ జూచుచున్నాము.

కైపాసు—మహాత్ములారా! ఇతనియందు మతానురాగ మమితముగానున్నది.

ప్రధమ—అందువల్ల నేగదా యితనిక్షీపాటు సంభవించినది.

కైపాసు—ఓరి జేసునను వాఁడా! నీవు నీమనఃస్ఫూర్తిగా దైవద్రోహము నొనర్చి యున్నావు. కనుక నీకు మరణశిక్ష విధింపనైనది. భటులారా! ఇతనిని మీరు రోమాపురి జూదుల యధిపతియైన పిలాతుని యొద్దకుఁ దీసుకవెళ్ళి మరియు తీర్మానమును సవిస్తారముగా నెఱిఁగింపుఁడు.

భటులు—చిత్తము (అని తీసుకవెళ్ళుట)

The Despair of Judas.

జూదాసు—(ప్రవేశించి) ఆచార్యులారా! మీయొక్క మాయాజాలములు నమ్మి నిష్కారణముగా దైవకుమారుఁడును లోకనాధుఁడైన జేసునాధుని మీకొప్పగించి గురుద్రోహమును సంపాదించుకొంటిని. ఇంతవఱకుఁ జాలును. మీరూకల మీరు గైకొనుఁడు. ఇఁకమీఁదట నెవరినైన నిట్లు మోసముఁజేయుట మంచిదికాదు.

కైపాసు—జూదాసా! మాపై నింత యాగ్రహము వహించితివేల? నిన్నేమి మోసముఁ జేసితిమి. నీయాప్తితను ఁ దీర్చకఁబోతిమా? అను కున్నమాటఁ దప్పితిమా? ఇందులో నీవొనర్చిన స్వామిద్రోహమేమున్నది? దైవద్రోహిని మాకప్పగించి దేశోపకారమును సంపాదించుకొంటివి. ఇంతకై మాపై యాగ్రహించి మేమునీకు బహుమతిగా నొసఁగిన వెండికాసుల బాఱవైచుట సమంజసము కాదు.

జూదాసు—ఇప్పుఁడు మీకపటోపాయముల గ్రహించి నాస్వామిద్రోహమును నేనుఁ దెలిసికొంటిని. ఇఁక మీమొగముఁ జూడరాదు. ఈరూకలు మీకవసరములేనియెడల నిదిగో మీదేవాలయమున వెదఁజల్లుచున్నాను. (అని చల్లుట) (వెళ్ళుట)

కైపాసు—ఆచార్యులారా! ఇప్పుఁడీ జూదాసు తన స్వామిద్రోహమును గ్రహింపఁ గలిగెను. గ్రహించినను యేమి ప్రయోజనము? చేయవలసిన దంతయుఁ జేసివేసెను. మనకు నష్టము లేకపోవడముగాక

వానికావంతయు లాభము గన్పింపదు. కాని యీ వెండికానుల నిప్పుడేమి చేయువలెను? దేవాలయపు ధర్మబొక్కసమున భద్రవఱచుట మంచిది.

ప్రధ—ఆఁరూకల నెంతమాత్రమైనను ధర్మబొక్కసమునఁ జేర్పరాదు.

వేద—ఆచార్యులారా! ఆద్రవ్యము దైవద్రోహిని క్రయధనమైనందున నవి ధర్మబొక్కసమున నుంచుట సమంజసముగాదు.

కైపాసు—అయితే ఆరూకల నేమిచేయవలెను?

ప్రధ—ఆరూకలతో నొకక్షేత్రముఁగొని పరదేశీయుల కొఱకై యొక శ్మశానవాటిక నిర్మించుట శ్రేయస్కరము.

కైపాసు—ఇది నామది కనుకూలముగ నున్నది. అది యాచంద్రతారార్క స్థాయిగా విలసిల్లఁగలదు.

ప్రధ—అశ్మశానవాటికను నేటినుండి రక్తపు క్షేత్రమని పిలువవలెను.

వేద—ఈనామ మీక్షేత్రమున కెంతయుఁదగియున్నది.

(అందఱు నిష్క్రమించుట)

జూదాసు ప్రలాపము.

జూదాసు—

సీ॥ ఆదాము హేవమ్ము॰లారాఁడు చేసిన
పాదిత్యమును పాపు॰పరమగురుని
పాపుల రక్షింపఁ॰బరమండలమునుండి
యవతరించినయట్టి॰యాత్మగురుని
మాయబడియున్నట్టి॰మోక్షకవాటముల్
తెఱువ వేంచేసిన॰దివ్యగురుని
మరియగర్భమునందు॰మనుజావతారంబు
జేసి ప్రసంగించు॰శ్రేష్ఠగురుని

గీ॥ అకట క్రూరుఁడనై నేను॰యుతని దుష్ట
గురుల కమ్మితి మనసొప్పి॰కుమతినై తి
ఇఁకను గతియేమి? నాద్రోహ॰మింతయనుచు
దెలసికొంటిని బ్రతికెసి॰తెలుపుఁగలదె॥

గతియేమున్నది? నరకమేగతి. పరలోక భూలోక సృష్టికర్తుని ముద్దులపట్టి కనలేని చిత్తసంక్షోభము దెచ్చిపెట్టిన కష్టమతి కాయము లోకమే శరణ్యము. ఇంక నేనెంతపశ్చాత్తాపము నొందినను నాకు రక్షణ్యము లభించుట కలలోనివార్త. ఆ సైతాను నన్నుతనస్థానమున కీడ్చుటకై యదిగో యెదిరి చూచుచున్నది. నే నీప్రపంచమున జీవించియు నేమి ప్రయోజనము? నలుగురిలో తలనెత్తి నెట్లు తిరుగగలను? ఛీ. ఛీ. నేను జీవించుట వ్యర్థము. నేను బ్రతుకుట నిరర్థకము. చచ్చుటయుత్తమము.

(అని యురివేసికొని చచ్చుట)

## Jesus before Pilate 1st Time.

## మూడవ రంగము.

(పొంస్యు పిలాతుఁడు ఏకాంతముగానుండుట ప్రాంతము వసార.)

**పిలాతుడు**—ఇప్పుడు నజరేతూరివాఁడైన జేసువు నొకక్రొత్తవేదమును రాజ్యనంగట బోధించుచున్నాడఁట. అందుపై వేదాచార్యులందఱు ఆతనిపై మత్సరము వహించి దైవద్రోహమనునిందమోపి యస్మదీయ మనుజ్ఞఁబడయుటకై ఇచ్చటికీడ్చుక వచ్చుచున్నారఁట. నేనేమి చేయవలెను.?

**యూదులు**—(ప్రవేశించి) ప్రభువర్యా! దండములు.

**పిలాతుఁడు**—మనోవాంఛాఫలసిద్ధిరస్తు. భటులారా! ఇతఁడెవఁడు?

**మాల్కస్:**—అయ్యా, ఇతఁడు నజరేతూరి కాపురస్థుఁడును జోసెపు కుమారుఁడైన జేసువనువాఁడు. ఈతఁడిప్పు డఖండపండితుఁడై యొకనూతనమతమును సృష్టిఁజేసి యూదయులందఱికిఁ బోధించి యనేకకలహములు పుట్టించెను. సీజరు చక్రవర్తికి శిఖాచెల్లఁగూడదని బహిరంగముగా నుపన్యాసము లిచ్చుచున్నాఁడు. ఇందువిషయమై యితనిని ప్రధమాచార్యులు పిలిపించివిచారించగా, తాను దైవకుమారుఁడనని చెప్పుకొన్నందున నితనిపై దైవద్రోహమున్ను సీజరు చక్రవర్తికి విరుద్ధముగా వర్తించినందున రాజద్రోహమున్ను మోపబడి మరణశిక్ష విధింపబడెను. అస్మదీయ యాజ్ఞకై నిచ్చటికిఁ బుత్తెంచితిమి.

పిలాతుడు— ఓరి మనుష్యుఁడా! ఆకర్ణించుచున్నావా? ఇందుల కేమి సమాధానమును చెప్పఁగోరవు?

యేసునాథుడు—(మౌనముగా నుండుట)

పిలాతు—నీవు యూదులకు రాజువేనా?

యేసునాథుడు—అవును నేను యూదులకు రాజువనుమాట వాస్తవము. కాని నా రాజ్య మీలోకసంబంధమైనది కాదు.

పిలాతు—యూదయులారా! ఇతనియం దావంతయు నేరము గన్పింపదు. ఈ యేసువును నాయాస్థానమున కెందుల కీడ్చుకవచ్చితిరి.

మాల్కుసు:—గీ॥ ఇతఁడు వడ్లవాడు • హీనుండు నొకకొత్త
మతముకల్పనంబు • మహినిఁ జేసి
సందుగొందులందు • సభలందు బోధించి
ప్రజలలో నగోల • ప్రబలఁజేసె.

ఇతఁడు గలలేయ దేశము మొదలుకొని యెరుసలేము వఱకుఁగల ప్రజలలో యంతఃకలహములు గలిగించి యైకమత్యమును జెఱచి సీజరు చక్రవర్తికిఁ బ్రతికూలముగా వర్తించుచున్నాఁడు. ఇతనియపరాధము క్షమింపదగినది కాదు.

పిలాతు—యూదయులారా! మీరందఱు నాపై నాగ్రహించిన ప్రయోజనమేమి? ఈ యేసువనువాఁడు గలిలేయ దేశమునకుఁ జేరినవాఁడు. ఇతని శిక్షింప నాకధికారము లేదు. హేరోదుని కధికారము గలదు. కావున మీరితనిని యతని యొద్దకుఁ గొనిపొండు.

మాల్కు— చిత్తము. (అని అందరు నిష్క్రమించుట)

Jesus before Herod

నాలుగవరంగము.

(హేరోదుని దర్బారు. మంత్రులు సేవకులు)

మత్తకోకిల.

రాజు—మంత్రివర్య మదీయ రాజ్యంబంతటను జెన్నొందునా
వింతసీమఁ జనములెల్లత్యంత సుఖములబడసిరే ॥మం॥

మంత్రి—రాజశేఖర జూదులకు నొకరాజపుట్టె విలాసులై
భూజనంబులకున్న నైక్యము పుడమి నణచెను చూడగా
రాజు— జూదులందఱు నతనిమాయలఁ జూచి నమ్మివినోదులై
భేదమెంచకనతనివేదము ప్రేమతోఁ జేకొంటిరే ॥మం॥
మంత్రి—జేసుఁ జేసెసి యద్భుతంబులఁ జెలిచె జూదులనందఱిన్
దాసులై యామాయగురునికి శిష్యులై చెలరేగిరి ॥రా॥
రాజు— పెద్దగురువులు యతనిపైఁ దమ ప్రేమజూపి విశేషులై
బుద్ధిఁ జెప్పక నూరకుంటిరి పుడమిలో యాతుచ్ఛునకున్
మనపిలాతుఁడు జేసుక్రీస్తుకు మరణశిక్ష విధించి యా
ఘనుల గౌరవమొందినాడే - కారణము తోచించి ర్గా ॥మం॥
మంత్రి—గురువులందరు నైక్యలై దుష్కూరులై యాజేసుకున్
మరణశిక్ష విధించి యాజ్ఞకు మనపిలాతుని కంపగా
నతడు సమ్మతినొంద కనుమన కంద జేయుచు జేసువుగా
హితువుగా నొక నుత్తరంబును వేగబంపె నధీరుడై ॥మ॥
రాజు—మంత్రిశేఖరా! జేసుక్రీస్తుకు మరణశిక్ష విధించుటయే ప్రథమా
చార్యుల కాహ్లాదకరమై యుండవచ్చును. వారలతిసాహసమున
నతని పట్టి కట్టి బంధించి నాయొద్దకుఁ బంపుట నాకు పరమానం
దము గలుగుచున్నది. జేసుక్రీస్తు మనసమక్షమునకుఁ జేరినతో
డనే కొన్ని యద్భుతంబులఁ నాతనిచేఁ జేయించవలయును.
మంత్రి—అద్భుతములఁ జేయుటయం దతనికి యసమాన సమర్థత్వము
గలదఁట. అతఁడు జేసెసి చిత్రవిచిత్రము లన్నియు మనము కన్ను
లారఁజూచి సంతోషింపవచ్చును. (జేసునాధుడు జూదులు
సేవకులు—( ప్రవేశించి ) రాజశేఖరా! పదివేల నమస్కారములు.
హేరోదు—మనోవాంఛా ఫలసిద్ధిరస్తు.
హేరోదు—భటులారా! యీ నేరస్థుడెవఁడు? ఇతనియం దే నేరము
మోపబడినది.
సేవకుడు—రాజశేఖరా పదివేల నమస్కారములు.
సేవకుఁడు—ఇతఁడు గలలేయదేశస్థుఁడు. జూదయకులస్థుఁడు. వడ్లవా
డైన జోజేపునికుమారుఁడు. నజరేత్తూరి వాసస్థుఁడు. జేసువను

నాముఁడు. ఇతఁడు జూదయులకు రాజుగా జన్మించెనఁట. దైవకు మారుడఁట లోకరక్షకుఁడఁట. పరమండలమునుంచి యవతరించెనఁట.

హేరోదు——ఇతఁడేనా ? దేశమంతట నద్భుతములఁ జేయుచు జూదయుల భ్రమపెట్టువాఁడు.

సేవకుఁడు—ఇతని మాయాజాలములే యద్భుతములై పరిణమించి జూదయుల భ్రమగొల్పినవి.

హేరోదు—ఇతని పైన యే నేరము మోపఁబడినది?

2 సేవకుఁడు—ఇతఁడు దైవకుమారుడని జెప్పుకొనుటచే దైవద్రోహమున్ను, సీజరుచక్రవర్తికి విరుద్ధముగా వర్తించుటచే రాజద్రోహమున్ను మోపఁబడినది.

హేరోదు—జేసువనువాఁడా! నేనిదివరకే నీవర్తమానమును పూర్తిగా నాకర్ణించి యున్నాను. నీవు నాయందనుమానము వహించక నీసభవారి యెదుటఁ గొన్ని యద్భుతంబులఁ జేసి నీప్రజ్ఞావిశేష గనుపఱచి వీరి కృపకుఁ బాత్రుఁడవగుము.

జేసు—(మౌనము నభినయించుట)

హేరోదు—ఓరి మూర్ఖా ప్రత్యుత్తర మొసఁగవేమి? నీసాహసము నాయెదుట జూపక నీవనకుకారివని యిచ్చుట దృఢపఱచుము.

మంత్రి—ఇంతమాత్రమునకే మీకుఁ బ్రత్యుత్తర మిచ్చెడివాఁడు కాఁడు. మన ప్రధమాచార్యులయందావంతయు యన్యాయము గన్పింపదు. ఇతఁడు రాజులనే లక్ష్యపెట్టఁడు. ఇఁక గురువుల నేమి లక్ష్యపెట్టును?

హేరోదు—పోంన్సుపిలాతుఁడు మనల చాలా సన్మానించి యున్నాఁడు మనము అతనిని గౌరవింపవలసి యున్నది. కావున యీ జేసుక్రీస్తుకు వెఱ్ఱివాని వేషమును వేయించి యితని శిక్షించుటకు నతనికధికారమొసఁగి పంపుట శ్రేయోదాయకము.

మంత్రి—రాజశేఖరా! భవదీయ యభిప్రాయమునకు వ్యతిరేకమేమున్నది? అస్మదీయ యాజ్ఞానుసారము నితనికిఁ దగిన వేషమువేయించెద. భటులారా ఇతనికి వెఱ్ఱివానివేషమును వేయుఁడు.

రాజు—భటులారా! ఇతనికి శ్వేతవస్త్రముతొడిగించి చేతికిఁ జెంగోలు ధరింపుము.

1 సేవకుఁడు—చిత్తము (అని వెట్టివాని వేషమును వేయుట)

రాజు—భేష్ ఈవేషమితని కెంతయుఁ దగియున్నది. ఈక్రిందివర్తమానమును నామారు పిలాతు ప్రభువున కెఱిఁగింపుఁడు.

సీ॥ నీతిమార్గమునందు • నిపుణత్వమును జెందు
పోంన్స్యు పిలాతుఁడు • పుణ్యుఁడనుము
ఈజేసువను వాని • యిందుఁ బంపుటచేత
పరమసంతోషంబు • బడితిననుము
ఈదైవద్రోహుని • నింపుగా శిక్షింప
నీకధికారంబు • నిచ్చితనుము
జూదయు వంశంబు • ప్రముఖ డగించిన
క్రూరుని మన్నింపఁ • గూడదనుము

గీ॥ పరమగురువులు నీలాగు • బరిహాసించి
క్రొత్తవేదము బోధింపఁ • గూడదనుము
పరమయానందమున నూరు • వందనములు
యాకరించితిననుము స • ఖ్యంబు ననుము.

ఇందు నొక్కటి బీరుపోకుండ పిలాతు ప్రభువర్యునికి నివేదించుము. నేను ప్రమోదమగ్నుండనైతి ననుము.

జూదులు...చిత్తము.

అయిదవ రంగము.

Pilate and his secretary.

పిలాతుప్రభువర్యుఁడు ఆతని యాంతరంగికుడు.

పిలాతు—ఆంతరంగికా! నీవు హెరోదుని యాస్థానమునకేగి యుంటివి గదా? అచ్చట విశేషము లేమి?

అంత—ప్రభువర్యా! ఇచ్చట మీయాజ్ఞ శిరసావహించి రోమాపురికేగి హెరోదుని యాస్థానమున కేగితిని. హెరోదుఁడు భవదీయకరణంబులకు సంతసించి జేసువనువాని మహోల్లాసమున విచారిం

చిరి. కాని యతఁడేమియుఁ బ్రత్యుత్తర మొసఁగియుండ లేదు. అందుపై యతనిని కనికరింపక కఠినశిక్ష నొందఁజేయుటకై మీకు పూర్ణాధికార మొసఁగి యతనికి వెఱ్ఱివాని వేషమును వేయించి మీసన్నిధానమున కనుపుచున్నవారు. ఈ చైదము లన్నియు నతఁడు మన సమాధానమును గోరి చేయుచున్నట్లు గనఁబడుచున్నది,

పిలాతు—అంతరంగికా! తప్పించుకొన్నను తప్పకున్నది. ఏమిచేయవలెను! అరెరే!! ఆ జూదులకేమి పోవుకాలము దాపరించినదో తోఁచకున్నది. ప్రధమాచార్యుల దుర్బోధనల వారు విశ్వసించి యీ సాధుసజ్జనుని శిక్షించుటకుఁ బహుప్రయత్నములఁ జేసి యార్భటించుచున్నారు. ఆచార్యుఁదరు తమ జీవనములకు నష్టము రాగలదని యతనిపై మత్సరము వహించి చంపింపఁ దలంచిరి. ఈ పామరజూదుల కీయార్భాటము లెందులకు? జేసుక్రీస్తు సాధుఁడు నిరపరాధియై యున్నాఁడు. అతని నేనెట్లు శిక్షింతును? నాయంతరాత్మ యెట్లు సహించును! ఇది యిట్లుండగ, నిన్నటి రాత్రి నాసతీమణి యొక స్వప్నమును గనినదఁట దానిని నాతో వివరించినదే గాక పరిచ్ఛేదమతనిని శిక్షింపవలదని యిప్పుడే వర్తమానము నంపినది. ఏమిచేయవలెను? "ముందరకు బోతే భావి వెనకకు బోతే చెఱు" నన్నట్లున్నది. జూదుల యార్భాటము ఁతిశయముగా నున్నది. జేసుని బంధవిముక్తుని జేయుదమా యంటే నన్ను పేల్చుక దినేటట్లుగాఁ గన్పడుచున్నది. ఏదియెట్లున్నను జేసుని ప్రాణమును గాపాడు నదుపాయము నాలోచింపవలెను. (నిదానించి) బేషు మంచి యాలోచన నా మనసున స్ఫురించినది. రేపు పాస్కామహోత్సవముగదా! వారు ఒకనేరస్థుని బంధవిముక్తుని జేయుట నాచారమై యున్నది. ఇప్పుడు నరహంతకుఁడైన బరబానుడు చెఱసాలయందు బంధింపబడియున్నాడు. వానితో నీజేసువును జతపఱచి జూదుల యభిప్రాయమునుఁ గోరెదను. వారుతప్పక బరబానుని ఖండింపవలసినదని యడుగుదురు. ఈసందర్భముపైఁ జేసుని విడుదలఁ

తెరయవచ్చును. (Jesus is scourged and crowned with thorns)

అనాను కైపాను జేసువుని బట్టుకొని భటులు బంట్రోతులు

ప్రవేశించుట. (Jesus before Pilate second time.)

పిలాతు—ఆచార్యులారా! నమస్కారములు

అనాను—శుభమగునుగాక.

పిలాతుడు—ఓరి సేవకా! నీవు సత్వరంబున బరబ్బాసు నిందు ప్రవేశపెట్టుము.

సేవ— చిత్తము (అని వెళ్ళును)

అనాను—ప్రభువర్యా! ఈ జేసువను వాని పక్షమూనము మీకు కీర్తి కాదు. ఇతనికి మరణశిక్ష విధించుటకై మీకు సలహానిచ్చుచున్నాను.

కైపాను— అట్లను మామగారి యాలోచన యుక్తమైనదని మీరెఱుగనివిగావు. శ్రీవారి యభిప్రాయము నుల్లంఘించుట మీకు శ్రేయోదాయకము కాదు.

(సేవకుడు బరబ్బాసుని ప్రవేశపెట్టుట)

పిలాతుడు—ఆచార్యులారా! మీ రెఱుగనిన్యాయము లేమిగలవు. మీ యాజ్ఞకవ్యతిరేకమేమున్నది. కాని యొక్కమనవిగలదు. ఆనాటినుండి నేటివఱకు పాస్క పండుగదినమున జెఱబడిన వారిలో నొకదుష్టుని విడుదలజేయుట నాచారమైయున్నది. నరహంతకుడైన బరబ్బాసుని మీ లో నెవ్వరును నెఱుగనివారుండరు. జేసువను వానిని బాగుగాగు ర్తెరుగుదురు? ఈ నేరస్థులలో నెవరిని బంధవిముక్తుని జేసిన యెడల మన రాజ్యము ప్రజలకు క్షేమముగానుండును.

అందరు—(కోలాహల ధ్వనులతో) బరబ్బాసుని విడుదలజేయుండి.

పిలాతుడు—అయితే జేసువను వానిని నేమిచేయవలెను?

అందరు—వానిని సిలువలోగొట్టుండి. కొట్టుండి.

పిలాతు—మహాశయులారా! మీరలీ జేసునాధుని యందేదోషము గనిపెట్టితిరి?

పిలాతు—(తనలో) ఇదియేమి పాపము! ఈ నిరపరాధుని యందు వీరికింత మత్సరమేల? వీరి క్రోధానలమునకు సహింపజాలకున్నాను. (ప్రకాశముగా) యాజకులారా! మీ బుద్ధిదీర నీ బుద్ధిమంతుని శిక్షించుటకు నప్పగించుచున్నాను. రక్షకసైన్యములారా

మీయిష్టప్రకార మీ జేసునాథుని ముల్లులతోఁ హింసింపుఁడు.
రాణువవారు—చిత్తము (అందరునిష్క్రమించుట)

## 6 రంగము.

### Jesus tied to the Pillar and tortured.

### జేసునాథుని రాతి స్తంభమునకుఁ గట్టుట,

1 రాణువ—ఓరిమనుష్యాధమా! జెరుసలేము దేవాలయమును విడియగొట్టి మూఁడుదినములలోఁ దిరిగి కట్టెదనని యీ దేశమంతటఁ బ్రకటించుచున్నావట. నిజమేనా? అట్టిశక్తి నీకుఁగలదా? శక్తి యున్నయెడల యిప్పుడు నీబంధముల సడలించుకొనుము. (అని కొట్టుట)

2 రాణు—ఓరిచాంధసుఁడా! వీనినన్నియుఁ బ్రగల్భములేగాని నిజమైన దొక్కటి లేదు. వీనిచేత నేమగునురా? వీనియిష్టమువచ్చినట్లు వదరుటకు చేతనగును? (అనికొట్టుచూ) అమాయకుల మాయజేసి, నీమహిమమునఁ జెప్పుకొనుచున్నావా!

3 రాణు—వీధులలోఁ బ్రసంగింపమంటే లేనిపోనివి కల్పించి యుపమానయుక్తముగఁ జెప్పెదవా?

4 రాణు—తూ తూ వీనిమొగము జూడరాదు. దేవగురుఁ దిరస్కరించిన పాపాత్ముండు. (అని కొట్టుట)

1 రాణు—ఛిఛీ వీఁడు రాజద్రోహుఁడు, వీనిదలఁపరాదు.

2 రాణు—పరేమంటా! మాయాచార్యుల నిందించితివా?

3 రాణు—అరెరే! వీనిగర్వమును వర్ణింపనశక్యముగానున్నది. ఓరిదుష్టాత్మ నిశ్చయముగా సినగోగులలో దేవునికుమారుఁడనని చెప్పుకొంటివిగదరా? ఇప్పుడు నీకట్లను విడిపించుకోరా (అనికొట్టుట)

4 రాణు—మిత్రులారా! వీనిదేహము చిక్కబారినది. మనమితని నెంత హింసించినను సంతసించుచున్నాఁడుగాని విలపించుట లేదు. ఇఁక మనమేమి చేయవలెను?

1 రాణు—ఈ దెబ్బలకితనిదేహమంతయుఁ జినిగి రక్తము వెల్లువలై పారుచున్నది. కాని వీనికిఁ జీమకుట్టినమాత్రము గా నుఁదలేదు

2 రాణు—హితులారా! ఇతనిపై నాకుఁగల కసియింకను దీరలేదు. (అని కొట్టి) ఇఁక నా చేతకాదబ్బ!

3 రాణు—ఈహింస నాకెంతయు మనస్కరింపకున్నది. ఇతనికి జూదుల రాజు వేషమును వేసి ముండ్లకిరీటమును ధరింపఁజేసి హింసింపవలెనని నాకోరిక. అప్పుడుగాని నాకసి దీరదు.

4 రాణు—అవును మన వానికి తుంటరి గుణగుణమందు ఈర్ష్యయధికము గానున్నది. అతనికోరికప్రకారము ఇతనికి రాజవేషమును వేయుడు.

(రాతి స్తంభమునుండి జేసునాథుని విడిపించి రాజవేషమును వేయుట)

2 రాణు—ఛీ ఛీ ఈవేషమితని కెంతయుఁ దగియున్నది. ఆ ముండ్లకిరీటమును శిరమున ధరింపుఁడు.

3 రాణు—(ధరించి) జూదులరాజా! నమస్కారములు (అని కిరీటమును శిరమునకుఁ దిగగొట్టుట.)

4 రాణు—(కిరీటమును నదిమి) ఆహా యిప్పుడితనికి శోభాయమానముగా నున్నది. తేజస్సౌందర్య మితని మొగమున కలకలలాడుచున్నది.

2 రాణు—అబ్బబ్బా! ఇప్పుడు నాకసి దీరినది. అదిగో జూడుఁడు. నెత్తురు కాలువవలె పారుచున్నది.

4 రాణు—(మోఁకాళ్ళఁ బెట్టికిల్చి) మిత్రులారా! ఇప్పుడితఁడు నిజమైన రాజుగా నున్నాఁడు.

1 రాణు—రాజేంద్రా! నమస్కారములు (అనిలేచి) ఛీ నీబ్రతుకు కాలిపోను. తూ తూ తు సిగ్గులేదురా వండ (అని పదతన్నుట)

(అందరు నిష్క్రమించుట)

(పిలాతుడు అనాసుడు కైపాసుడు జూదులు ప్రవేశము.)

రాణువవారు జేసునాథుని పెడరెక్కలవిరచికట్టి సభారంగమున నిలువపెట్టుట.

## Jesus condemned to death.

మొదటిస్థలము జేసునాథుఁడు మరణ తీర్పుకు లోనగుట.

పిలాతుఁడు—ఓరి రాణువలారా! ఆజేసునాథుని యున్నతస్థలమున నిలువబెట్టుడు

రాణు — చిత్రము. (అని యుక్తైన స్థలమున నిలువబెట్టుట)
పిలాతుఁడు లేచి (ప్రజల వైపు చూచి)

సీ॥ ఇదిగో యీ మనుజుండు • యితనివైపును జూఁడుఁ
డండయూకనుల పా • పాంధులార
ఇతఁడు దేశమునంత • నితని వేదముతోఁగ
జెఱిచెఁ దప్పేమి? • శ్రేష్ఠులార
ఇతఁడునే దేవుని • కిష్టమైన సుతునంచుఁ
బ్రకటించుఁ గొననేమి? • భక్తులార
ఇతఁడనపరాధి • యితనిపైఁ గ్రోధంబు
మానుఁడు దయచేసి • మాన్యులార
గీ॥ ఇతఁడు సన్మార్గవర్తియై • వెలసినాఁడు
సత్యదేవుని వేదంబుఁ • జల్లినాఁడు
నిజపదార్థంబుఁ దనలోన • నిలిపినాఁడు
కనుక నితనిని రక్షింప • గణనగాదె॥

అందఱు — (కోలాహల ధ్వనితోఁ) వానిని స్లీవలోఁ గొట్టండి వానిని స్లీవలోఁ గొట్టండి.

పిలాతుఁడు — అహా! ఈ యూదుల కాఠిన్యము నేమనఁగలను! ఈ జేసునాథుని ప్రస్తుతస్థితి నవలోకించిన నెట్టి పాషాణ హృదయములైననుఁ గరఁగి పాఱును గదా? ఈ ముష్కర యూదుల మనమున కావంతైన కనికరము జనింపదయ్యెను. (ప్రకాశముగా) ఆచార్యులారా! మీ రెంత మొరపెట్టినను మీ మొఱ లాలోచింపఁబడవు. తపోనిష్ఠాగరిష్ఠుఁడైన యీ జేసునాథునకు మరణశిక్ష విధింపఁజాలను.

కైపాసు — (కోపముతో లేచి) ఓఁ పిలాతుఁడా! క్రైస్తమతహితుఁడా! ఇప్పుడు నీకనులకు మేము కన్పించుట లేదా యేమి? మదీయ గౌరవములఁ దృణప్రాయముగాఁ బరిగణించి యీ విమతుని విడిపించెద నని నిర్భయముగా నీసభారంగమున వక్కాణించుచున్నావు. నీకనులకుఁ బొరలెక్కినవి కాఁబోలు. ఇదిగో వినుము.

ఆ॥వె॥ ధీరులైన మమ్ముఁ • [illegible]లియక నీ జేసు
మతమున నమ్మి నీవు • మహిమ దనరి

యితని విడిచి పుచ్చి • యిఁక పైనఁ బ్రతుకంగ
గలవె నెంచి చూడఁ • గటికచెనటి.

అనాసు! ఆ! వె! నీకు సేజరుండు • నిజమైనహితుడంచు
మనమునందు నేఁడు • మఱచిపోమ్ము
నిన్ను మరణచాయ • నిలచి బిలుచుచునుండ
నీవున్యాయమందు • నిలువఁగలవె.

పిలాతుఁడు—(భయపడి) ఆచార్యులారా! నాపై మీకింత యాగ్రహ మేల! వేదమూర్తులైన మీరింతగా పట్టుబట్టినప్పుడు నేనేమి చేయుగలను! ఇతనికి మీయిష్టప్రకారము మరణదండనవిధించెదను. కాని యీనిరపరాధుని రక్తమునకుఁ నేఁబాత్రుఁడగాను, (చేతులుకడుగుట)

అందరు— అవునయ్యా యీ పామరుని రక్తము మామీఁదనున్ను మాసంతతిమీఁదనుండునగాక

పిలాతు—ఓ శేనునాథుఁడా! ఈ ఆచార్యులఁ గోరిక ప్రకారము నిన్ను స్లీవలోఁ గొట్టిచంపుటకు నాజ్ఞనిచ్చితిని.

అందరు—(కోలాహలధ్వనులతో) మహాసంతోషము. అనిచప్పట్లుకొట్టుట
(జై పిలాతు ప్రభువుకుజై)

అందరు నిష్క్రమించుట

గద్య! ఇది జేసునాథస్వామి వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర రేచర్ల
గోత్రపవిత్ర గంజి యిన్నారెడ్డి పుత్ర బాలశౌరిరెడ్డి
నామధేయ ప్రణీతంబైన మృత్యుంజయ
నాటకమున ద్వితీయాంకము
సమాప్తము.



శ్రీ

# మృత్యుంజయనాటకము

తృతీయాంకము

మొదటిరంగము.

The journey of Christ to Calvari.

(యేసునాథస్వామి స్లీవతో రాణువమధ్య ప్రవేశించుట)

1 రాణువ. ఆ॥ ఓరి క్రొత్తగురువ • యూదుల దుర్మార్గ
నడువు నడువు మింక • నడువవేమి?
చూడు చూడు మదిగో • జూపట్టుచున్నది
నీకపాలకొండ • నీవు మోయు॥

నీమాయవేషము లిచ్చట నిష్ప్రయోజనములు. ఈ స్లీవను నీవు కపాలకొండకుఁ జేర్పకఁ దప్పదు. జాగేలఁ జేసెదవు? పదపద.

2 రాణువ— ఓరి గురుద్రోహుండా!

ఆ॥వె॥ నీవు మోయకుంటె • నీతాత యొక్కండు
గలఁడె స్లీవమోయఁ • గణనఁజేయ
నోరుగాదు ప్రేల • పిరికిబంటు పోదఁబు
గాదు నిదియ ఘోర • కఠినస్లీవ.

ఇది రాజ్యమంతటఁ బ్రసంగించుటకు మతముఁగాదు. నీకొఱకై తయారుచేసిన స్లీవమ్రాను. దీనిపై నిన్ను కొట్టవలసి యున్నది. కనుక నీవు దీనిని మోయకఁ దప్పదు. పదపద.

3 రాణు — వీని మొగము వెలవెలఁ బోవుచున్నది. వీడెక్కడ? ఈభారమైన స్లీవ మోయుటెక్కడ?

4 రాణువ—ఏమిరా దేవకుమార ఈస్లీవ నీకు భారమైనదా? దేవునికి భారమేమియు లేదు. పదపద, నడునడు (అని నెట్టుకొని వెళ్ళుట)

(3 స్థలము జేసునాథుడు భారమైన శ్లీవమ్రానుతో రాణువమధ్య
బోర్లఁ బడియుండుట)

1 రాణు—

ఆ॥ వె॥ ఓరి వేదమూర్తి • యుక్తి దేలరా
కాయాపనంబుఁ • గలుగనయ్యె
గమ్యస్థాన మదిగో • గన్పట్టుచున్నదీ
చింతయేల కొద్ది • శీఘ్రకిట్లు.

ఓరి మహస్థాపకా! ఇప్పుడు నీవిన్నుఁగడ లేమియుఁ బనికిరావు. ఈ శ్లీవను మోయుట నీకు దప్పినది కాదు. కపాలపర్వతము సమీపించుచున్నది. లెమ్ము లెమ్ము (అని లేవఁదీయుట)

2 రాణు—మిత్రులారా! వీనికి రక్తమంతయు వ్యయమైనది. ఇతఁడు నిత్రాణుఁడయ్యెను. మనకు కార్యభంగమగునేమో యను భీతి నన్ను బాధించుచున్నది.

1 రాణు—ఓరి పిచ్చివాడా! దేవుని కుమారునికి రక్తక్షయ మున్నదా? చూడుము రాజా నమస్కరించెదను. నడువు నడువు.

1 రాణు—సత్యముఁ బోధించిన శ్రేష్ఠగురువా! నడువు నడువు. నీవు నడవకఁ దప్పదు. (అని కొట్టుట)

4 రాణు—వీని బ్రతుకే మొండిబ్రతుకు. ఇతనిని రాతిస్తంభమునకుఁ గట్టి కొట్టిన దెబ్బలకు నేనైతేఁ జచ్చేవాణ్ని.

2 రాణు—ఆ॥ వె॥ వీఁడు మొండివాఁడు • వీఁడువరకుఁ గొట్టుండు
నడుచుఁ దప్పకుండ • నవ్యమైన
నడకనేర్చునితఁడు • నడుఁకగిరిఁ జేరు
నెట్టవలయు మీరు • నేస్తులార॥

1 రాణు—నీకు చావుఁ దప్పదురా! నడునడు పదపద (అని నెట్టుట)

నాలుగవ స్థలము.

(దేవమాత వీధిలోఁ జూచుచుండుట జేసునాథుని రాణువవారు
నెట్టుకొని వచ్చుట)

దేవమాత— కరుణ.

1 అయ్యయ్యో యేసువా - అన్యాయమయ్యె
అయ్యా నినుఁగాపాడే అయ్యా లెవరయ్య ॥అయ్య॥
2 జూదులందఱునిన్ను - ద్రుక్కించిరయ్య
సాధుండనుశబ్దంబు - శబ్దించరయ్య॥ అయ్య॥
3 పోంన్యుపిలాతుండు - ఘోరవిచారుండై
హింసించి నినుఁజంప - విధియించెనయ్య ॥అయ్య

అకటకటా నేనేమిసేయుదును? ప్రధమాచార్యుల యాగ్రహంబున కోర్వజాలక పోంన్యుపిలాతుఁడు నీకు మరణదండన విధించెను. కిరాతులైన నీ రాణువసైన్యము భారమైన శ్లీవమ్రాకును నీభుజముపై బెట్టి కపాల పర్వతమునకు వెళ్లాయమని హింసింపసాగిరి. నా కుమారా నీబాధల నెట్లువలోకింతును. యీ యవమానమేమని భావింతును! నాదుఃఖము నెట్లుభరింతును? ఓ పుత్రకా? పేదకు దొరికిన పెన్నిధి చందమున నిన్ను నరచేతి నిడికొని యతిగారాభమున బెంచుకొని నేటికి కిరాతుల పాలు చేయవలసివచ్చె. అయ్యయ్యో! నాహృదయమునఁ బాకుఁ గ్రుమ్మినటు లున్నది. ఈబాధ నేనెట్లు సహింతును. (అనికూలబడుట)

1 రాణు— కం॥ చూచెద వేమిటి యామెను।
దాచకనాతోడఁ జెపుము • దైవకుమారా।
యోచనఁ జేసెదఁ గొంచెము
తోచిన నుపకారమింక • దొరకుననుమిమ్మా॥

2 రాణు— ఆమెగారు. వీని గన్న తల్లిరాబాబు.

1 రాణు— అటులైతే కొంచెమింతని నిలుపుడు. పాపము కన్న తల్లిని క్రేగంటి చూపుల నలరింపగలడు.

2 రాణు— మంచిది.

ఆ॥ వె॥ చూడగోరినిన్ను • జూచుటకై గన్న
తల్లివచ్చెనిట్టి • యుల్లమందు
చింతజెంది యేడ్చె • స్మృతి యున్నదిఁలా
ఆదరించి పంపు • మయ్యవేగ॥

3 రాణు—బళే, కన్నతల్లి కవలీలగ భ్రమపడగవి నానుగుడు. పాపము!
కన్న నేరానికి గడువు తాలిపోవుచున్నది.

4 రాణు—ఈమె కొఱగాని కొడుకును గన్నది. వరే మాతృద్రోహి!
చూచినవఱకు జాలు నాలస్యమగుచున్నది పద పద.

(అని నెట్టుకొని పోవుట)

అయిదవ స్థలము.

(రాణువ మధ్య జేసునాథుడు భుజముపై స్లీవతో ప్రవేశము)

4 రాణు—మిత్రులారా! వీడు కపాలపర్వతము జేరక ముందుగానే
చచ్చునట్లున్నది.

3 రాణు—అవునవును వీని ముగము కూడ వెలవెల బోవుచున్నది.

4 రాణు—అయితే యిందులకు దగిన యుపాయ మాలోచింప వలసి
యున్నది.

1 రాణు— ఆ! ఏమి శ్రోత్రగురువీరి • సందేహంబు
దీరు మార్గమేమి • దెలుప గదర
నాకపాలగిరియు • వనతిదూరము గలదు
నవబలంబు దాల్చి • నడువ గదర॥

2 రాణు—ఇవి యన్నియు వ్యర్థాలాపములు. మన క్రోధమింకను జల్లార
నేలేదు వీడు నడుచుటకు స్వతంత్రుడయ్యె. నేమి చేయవలెను?

1 రాణు—(తలనెత్తి చూచి) ఆమార్గము నబోయ్యెడివాడెవడో త్వరగా
బట్టుక రమ్ము.

3 రాణువ—(పరుగెత్తి పట్టుకొనివచ్చుట)

1 రాణు—ఓరి ప్రయాణికుడా! నీయూరి పేరేమి!

శిమియో—మావూరుపేరు సిరోను

1 రాణు—నీపేరేమి?

శిమియో— నా పేరు శిమియోనుడు.

1 రాణు—మంచిది నీకు దగిన కూలిచ్చెద. కపాలపర్వతము వఱకు
నీ జేసునకు సహాయముగా రమ్ము.

శిమియో—అయ్యలారా! మన్నించుడు. నేను యింటియొద్ద నవసరమైన

పనులఁబెట్టుకొనివెళ్ళుచున్నాను. ఇంతమాత్రము నాయందు దయ నుంచి నాకు శెలవొసఁగుడు.

2 రౌతు—పనిగిని పనికిరాదు. నీవు దొరతనమువారి యాజ్ఞనుల్లంఘించెదవా! పదపద (అని నెట్టివేసుకు సహాయముగా స్త్రీవను బట్టించుట.(

3 రౌతు—ఓరి క్రొత్తగురువా! ఇప్పుడు నీకు యదృష్టము పట్టినదిరా!

4 రౌతు -వీని దురాదృష్టమును వర్ణింపవలెనా? అదృష్టవంతుఁడగుట వల్లనే యీ శిమియోనుఁడు లభించెను.

3 అవును. ఇతనియదృష్టమువల్లనే ఇటువంటి మరణశిక్ష విధింపఁబడినది.

2 రౌతు ఆ॥ వే॥ ఇతఁడు దేవపుత్రుఁ • డిలకు నేతెంచిన
మనుజ రక్షకుండు • మాన్యుఁడగుట
వలననిట్టి శ్లీవ • వైభవములరంగ
మోసియురణ మొంద • వ్రాసెనెమొ॥

3 రౌతు—అవును. మఱచితిని. దీనిని మీరుచక్కఁగా సమర్థించితిరి.

4 రౌతు—దొంగగురువా! ఆక్రందించుచున్నావా? పదపద(నెట్టుక వెళ్ళును)

The cloth given to Christ by Veronica

ఆరవస్థలము (వెరోనికమ్మ)

ప్రవేశము.

(రౌతువమధ్య యేసునాథుని ప్రవేశము.)

హా! లోకరక్షకా! ప్రపంచములో నీకీలాటి చిత్రహింసలు సంప్రాప్తములయ్యెనా? తండ్రీ నిన్ను జూడనాకన్నులు మూతలఁబడుచున్నవి. పరలోక భూలోక పాతాళముల కధిపుండవైన నీకీ యవమానకరమైన మరణము సంప్రాప్తంబగుటకుఁ గారణమేమి?

సీ॥ మనుజుల రక్షింప • మనుజావతారంబు
నెత్తినసర్వేశు • కెంతవచ్చె
నెత్తురుక్షీణమై • నిత్రాణమై శ్లీవ
భారముచేఁ బొర్లఁ • బడఁగవచ్చె!
జూడుము క్రౌర్యంబుఁ • జూడగ హెచ్చయ్యె
నఁడుగులిడుట నీకు • బెసిదమయ్యె!

నీశరీరము క్రుంగి • నీ రసము కుటచే
నిలువఁజాలక • వంగినిలువవలసె!

గీ॥ సకట పదియారువన్నెల • నలరుతావి
కనయు, దేహంబునకు జూడ • నెంతవచ్చె!
తారకేంద్రుని కళమించు • దమరిమొగము
సొగసుకింతటి హానిని, • జూడవచ్చె!

జేసునాయకా! నీరూపము నవలోకింప నాహృదయము శతధా భిన్నము లగుచున్నది. ఈ రాణువవారు నిన్ను హింసించుచు హింసలను నాకన్నులఁజూడఁ జాలకున్నాను. నిన్ను పరిజేయులు పట్టి బంధించినప్పటి నుండియు అన్నపానీయములు విషతుల్యములయ్యెను. దైవకుమారా! భయంకరమైన క్లేశయాత్రయందు మీ యలంకారమంతయుఁ జెడి విరూపమయ్యె. మీ యవయవములనుండి రక్తముఁ గారుచున్నది. కావున తండ్రిగారా! నన్ను కనికరించి నావస్త్రముచే మీ మొగమును దుడుచుకొనుటకై ప్రార్థించుచున్నాను.

(జేసునాథుఁడు హెరోనికమ్మ యనవి నాలకించి వస్త్రముఁచేఁ దమ మొగము దుడుచుకొనుట ఆమెవస్త్రము ఆమెకిచ్చుట)

హెరోనికమ్మ—(వస్త్రమునందుకొని చూచి) ఆహా ఏమీ? యతి శయము? ఈవస్త్రముపై జేసునాథుని ముఖవిలాసము ముద్రింపఁ బడినది.

1 రాణు॥ ఆ॥ వె॥ ఓరి బోధగురుడ • యువతివస్త్రము చేతఁ
ముఖముఁ గ్రొత్తసొగను • దొరికెనింక
తడవు లేకపదర • తడఁబడకనడుగులు
జూడరాజ! ప్రజలు • చోద్యమంద.

2 రాణ—ఇప్పుఁడితని విరూపము మారి సురూపమయ్యె,

ఆ॥ వె॥ నఁడువునఁడువుమింక • సమమైనబలముతో
ఘుశియకొనసీవు • గమ్యస్థాన
మందగలవు చింత • నొందక ధీరవై
చనరమాయగురవ • జాలమేల.

3 రాణు—పదపద (అని నెట్టుకొనిపోవుట.)

హెరోనికమ్మ__ఓ ప్రజలారా! మతాభిమానులారా! లోకరక్షకుఁడైన జేసునాథుని ముఖవిలాసము నవలోకింపుఁడు. ఈ మొగవిలాసము వర్ణింప నెవ్వరికలవగును? ఈజూదులు జేసునాథుని మహాత్మ్యము నెఱుఁగక నిట్టియకార్యము లొనరించుచున్నారు. ఈపాతకము ను వీరిసవట్టికుఁ పకమానదు.

ఏడవస్థలము.

జేసునాథుఁడు భుజము పై స్త్రీవతో రాణువమధ్య ప్రవేశించుట.

1 రాణువ__మిత్రులారా!. ఇతఁడు మిగుల నిత్రాణుండయ్యెను. కపాల పర్వతమింకను రాలేదు. ఏవిధమునవైనను గమ్యస్థానము నకుఁ జేర్పవలెను.

2 రాణు॥ ఆ॥ వె॥ భయము దేల నితఁడు • భగవంతునకుపుత్రుఁ
డగుట చేత మాయ • లన్నిఁజూపి
నాఁడు కానఁదిరిగి • నవమైన బలముతో
జేరఁగఁడు గిరికి • శ్రేష్ఠులార.

3 రాణు—ఇది నిజమైయున్నది. ఇతఁడునిజమైన యూహారమునిన్ని యతని మాంసమును భక్షించి రక్తమును పానముజేయునివాఁడు నిత్య జీవమునొందఁజాలడని బోధించెనుగదా! అట్టిసత్యసంధుఁడింతలోఁ జచ్చునా!

4 రాణు—నీవు నిజమైన యూరమేలాగైతివిరా!

3 రాణు—ఓరి వెర్రివాడా! పరమాంసము నెవరైన భక్షింతురా!

1 రాణు॥ ఆ॥ వె॥ వానిబోధలవియె • వైభవంబుగ రాజ్య
మంతజొనిపి కేమా • మల్లినాఁడు
పిచ్చిశిష్యులంత • ప్రేమతోగొనియాడి
నారు నితనిమంత్రి • మరయలేక.

2 రాణు—నిజముగా వీనివొద్ద నేవియో కొన్ని మంత్రము లున్నవి. వాటి ప్రభావమున ప్రజలనందఱి తనవశముఁ గావించుకొనెను. మాయామహిమచే నితని శిష్యులంద రున్మత్తులై గ్రహింపఁజాల కున్నారు.

3 రాణు—ఓరి మాయకుఁడా! నీమాయలఁ గట్టిపెట్టి తిన్నఁగ నడువు.
అదిగో కపాలపర్వతము.

4 రాణు—ఓరి జేసువా! నిరాశ నొందకు. దగ్గఱికి రానేవస్తిమి.

3 రాణు—ఒరే! శంకించెదవేమి, పదపద (నెట్టుకొని వెళ్ళుట)

యెనిమిదవ స్థలము.

జెరుసలేమువీధియందు పుణ్యస్త్రీల సమూహము.

జేసునాథుఁడు భుజముపై శిలువతో (ప్రవేశించుట)

ఒక స్త్రీ—అయ్యయ్యో! ఇదియేమి యన్యాయమో దోఁచకున్నది. మొన్న మొన్ననే ఈరక్షకుని ప్రజలెల్లరు పరమానందముతో మహావైభవముతో నాహ్వానించిరిగదా, ఇంతలో వీరికేమి పోవుకాలము దాపరించినది? ఈ జేసునాథునిపై దుష్టస్వభావము వహించుట కేమి కారణము? జేసునాథుఁ డీ జూదులకుఁ జేసిన యపకారమేమి? గొఱ్ఱెపిల్లపైకి పెద్దపులి దూకిన చందమున నీ దుష్టులు రక్షకునిపైఁబడి హింసించుచున్నారు.

సీ॥ పరలోక భూలోక • పాతాళములదాఁక
సృజియించె నెవ్వారు? • చెన్నుమీఱ
మరియ గర్భమునందు • మనుజావతారంబుఁ
దాల్చెను నెవ్వారు? • ధరణిపైన
మనుజ సంతానంబు • మహిమీఁద ప్రబలంగఁ
గలిగించె నెవ్వారు? • కనఁగతోడ
నభమున వెలిఁగించు • నక్షత్రకూటంబుఁ
బుట్టించె నెవ్వారు? • పొల్పుమీఱ
గీ॥ చంద్రసూర్యులు దీపింప • సలిపె నెవరు?
నతఁడు శ్రీజేసువని మది • నరయలేక
చిత్రహింసలు గావించి • చెంపి చెంపి
చంపుచున్నారు నేమందు • చరితలార.

రెండవస్త్రీ—అహా! ఈ జూదుల క్రౌర్యము మిన్నుముట్టుచున్నది. రక్షకుని పాటులఁ జూచిన పాషాణములైనఁ గరుగును గాని యీ క్రూరుల హృదయమున జాలి జనింపదయ్యో. వీరిచేష్టల నవలోకింప

యమకింకరులు తెలవులకు వచ్చుచున్నారు. జేసునాధుని యొక్క తోపమానములు వీరి చెవులకు విషతుల్యము లయ్యె కాబోలు.

స్త్రీ లందఱు

కీర్తన

1 జేసునాయక జూదలందఱు-జేరి నిను హింసింపసాగిరి
న్యాయమా - యిదిమా నేయమా॥ జేసు॥

2 భారమైన స్లీవమాకనుc-గోరినిను మోపించసాగిరి
ధీరుడా శుభ-చారిత్రుడా॥ జేసు॥

3 మనుజరక్షకాకోలకు నీటు యవ-మానమరణముc గోరినావా
నాయకా మోక్షదాయకా॥ జేసు॥

ఒక స్త్రీ — లోకరక్షకుడవైన జేసునాయకా! నీకష్టముల మాకన్నులc జూడజాలము. నిష్కారణముగ నీశత్రులు నిన్ను హింసించుచున్నారు.

జేసు — (వీరివైపు జూచి) ఓ జెరుసలేము కుమార్తెలారా! నానిమిత్తము మీరు విలపింపక మీనిమిత్తమును మీపిల్లలనిమిత్తము విలపించుడు.

1 రాణు — బేష్! మంచిజవాబు. చచ్చేవాడనైన నానిమిత్తము మీరు ఏడ్చిన నేమి ప్రయోజనము? మీకును మీపిల్లలకు నీపాటు రాకుండc జూచుకొమ్మనుచున్నాడు.

2 రాణు — బలే! నగముజచ్చినను నీప్రవసంగములమానకపోతివిగదరా!

3 రాణు — వీనికూతలతో నేమిపని? నెట్టుడు నెట్టుడు.

4 రాణు — పదపద (అని నెట్టుకొనిపోవుట.)

ఒక స్త్రీ — ఈ రాణువ వారెంతకఠినాత్ములమ్మా జేసునాధుని దేహము నుండి రక్తము ప్రవాహములై పాఱుచున్నను రవ్వంతయైన కనికరము జూపింపరైరి. ఇప్పుడు జేసునాధుని వినయవిధేయత వర్ణింప నలవిగాదు. శ్రీవారిట్టువంటి భయంకరస్థితిలో నుండియు మనం నోదార్చుచున్నారు. ఈక్రూరుల నొకనాటి కీపావము వేధింపకమానదు.

రెండవస్త్రీ—అమ్మా! ఇఁక మనకు జేసునాథుని దర్శనభాగ్యము లభించునా?

ఒకస్త్రీ—ఇది స్వప్నమనఁ దలంపకుము. జేసునాథుఁడు మనకుఁ బ్రసంగించినట్లు వారి పునరుత్థానములోఁ జూడవచ్చును.

రెండవస్త్రీ—ఇందులో సనృతమున్నదా? వారు మరణమునొందిన మూఁడవనాఁడు ఆత్మశరీరముతో మహోజ్జ్వలకముగా లేచెదరు. పరలోక భూలోకములు పొర్లినను పొర్లునుగాని జేసునాథుని వాక్యము పొర్ల నేరదు.

ఒకస్త్రీ—అట్లయితే శ్రీవారి దర్శనము మనకుఁ దప్పక లభించును.

అందరు నిష్క్రమింతురు.

## తొమ్మిదవ స్థలము

రాణువమధ్య జేసునాథుఁడు స్లీవను మోయజాలక దొర్లఁబడుట.

1 రాణువ—ఆ! వె! మిత్రులార వీని • మీఁదిస్లీవనుదీసి
లేవదీయుఁడప్పుడు • లేచునిజము
యంతస్లీవపైన • నదిమికొట్టి బిరాన
యముని సదనమునకు • నంపవలయు!

ఆలస్యమేల? స్లీవమ్రాను దించివేయుఁడు. అతఁడు మూర్ఛిల్లియున్నాఁడు.

2 రాణు—మంచిది. (అని స్లీవను దించివేయుట)

1 రాణు—ఇతని తిన్నఁగ లేవదీసి నిలువఁబెట్టుఁడు.

2 రాణు—అలాగే లేవదీయుచున్నాము. (అని లేవదీయుట)

ఆ. వె. చూచినార! వీఁడు • చూఁడ్కులు నిగిడించి
చూచుచుండె మనల • చోద్యమంద
మాయచేసి పుడమి • మనవలెనని కోర్కె
కలిగెనేమొ నిప్పుఁడు • గనఁజేయ.

3 రాణు—వీఁడు మొండిచేష్టలకుఁ బుట్టినిల్లు. వీనికి బ్రతుకవలెనని బుద్ధి బుట్టినను మనము బ్రతుక నిత్తుమా?

4 రాణు—ఓరి జేసువా! నీకి జీవితమేల కావలెనా! నీవు జనకంటకుఁడవైతివి కాన ప్రాణముపై నాశబెట్టుకొనకుము కాబు

పదిస్థలము జేసునాథుని వస్త్రముల నొలచుట.

1 రాణు—సఖులారా! ఈ కాలహరణమేల? ప్రొద్దుబోవు చున్నది. శ్వరగా నీతని వస్త్రములం దీయుఁడు

3 రాణు—ఇదిగోఁ దీయుచున్నాము. (వస్త్రములకలివముగనొలచుట

2 రాణు—(అంగీ చేతపట్టుకొని)

ఆ॥ వె॥ జేసుదేహమంతఁ • జిరిగి యంగీకెట్లు
నంటుకొననో చూఁడుఁ • డన్నలార
వెదఁగుపాఁడు యితఁడు • వేయుఁడు స్లీవపై
నెనరు వింతలేక • నేర్పుతోఁడ॥

4 రాణు—ఇతని వస్త్రములు మనము పంపకము చేనుకున్న మీఁదట సిలువవేతము.

1 రాణు—చిల్లగవస్త్రము లన్ని పంచుకొని యీ చట్టకు నదృష్టచీట్లు వేసికొందము.

2 రాణు—అవును. ఇటువంటి యద్భుతకరమైన యంగీని యింతవఱకు భూలోకములోఁ జూచి యెఱుగము. ఇఁక చూడపోము.

3 మంచిది (అని అందఱు కూర్చుండి వస్త్రములు వంపకమును చేసికొని యంగీకి యదృష్టచీట్లు వేయగా ! రాణువవానికి నంగీవచ్చుట)

1 రాణు—నేనే అదృష్టవంతుడను. అద్భుతమైనయంగీ నాకు లభించినది.

ఆ॥ వె॥ నేను దీనిఁదొడిగిఁ • నిజముగ జేసునై
సత్యవేదమంతఁ • జల్లువాడ
గడకు మోక్షపదవిఁ • గాంచి విజృంభింప
శిష్యకోటినంతఁ • చేర్చువాడ॥

2 రాణు—మహాసంతోషము. ఇప్పుడు జేసునాధునిపాటులు నవలోకించుచున్నావుగావా? ఇంతకు రెట్టింపు హింసలు నీకు సంప్రాప్తమగును సుమా! అందరు (నవ్వుట)

పదునొకండు పన్నెండుస్థలములు

Jesus nailed to the Cross

జేసునాధుని స్లీవలో గొట్టినిలుపుట

1 రాణు—పుత్రులారా! ఈ జేసునాధుడు ప్రాణఁజెడియున్నాఁడు ఇతనికి

తత్కాలిక సత్వములభించుటకై పిచ్చితో మిశ్రమమైన ద్రాక్షారసము నొసఁగుదు.

2 రాణు— ఓరిమతవిచారీ!

కం॥ ద్రాగుము ద్రాక్షారసమును
బాగుగనీదేహమునకు • బలసత్వంబున్
రాఁగలదు మీఁద మోక్షము।
పోఁగలవు మిథ్యగాదిది • భూరివిచారా.

(అని యివ్వఁబోవును)

జేసు— నేను ఈ యీలాటి మత్తుపదార్థమును సేవించెడివానివి గాను.

1 రాణు— ఓరీ మూర్ఖుఁడా! ప్రాణముఁ బోవుచున్నను వేదవిచారము ను మఱవకఁ బోతివి గదా!

2 రాణు— వాఁడెట్లుమఱచును? ప్రపంచమందలి ప్రజలెల్లరు మద్యపానము ను సేవించి సమస్తైశ్వర్యమును గోలుపోయి దరిద్ర దేవతకు దాసులై దంపతులననురాగ రహితులై పాపభూయిష్ఠులై తిరుఁగుట నీవేఁడు జూచుచున్నాడుకదా!

3 రాణు— ఈనీతుల కేమి లే ఈరసము నకితఁడు పాత్రుండు కాడు.

4 రాణు — రండు రండు ఇతనిని స్లీవపైఁ బరుండఁ బెట్టి బిగించవలెను.

(అందఱు పట్టిజేసునాథుని స్లీవపై బరుండబెట్టి మేఁకుల తో గొట్టుట)

Jesus dies on the Cross

8 రాణు— ఇతనిశిరస్సుపై నేరస్థాపన పలకఁ బిగింపవలయును గదా? వానిపై నేమి వ్రాయవలయును.

1 రాణు— జూదులరాజని వ్రాయుము.

4 రాణు— ఇతఁడు జూదులరాజెట్లగును?

1 రాణు— నేనుజూదులరాజునని చెప్పుకొనియున్నాఁడు ఇతనినామము లోకాంత్యమువఱకు పరిహాసమునకుఁ బాత్రమైయుండును.

2 రాణు— ఈపేరు బాగుగాలేదు. రాజద్రోహుఁడని వ్రాయవలెను

1 రాణు— ఏమిచెప్పితినో చెప్పితిని రాదులరాజనియే వ్రాయుఁడు.

3 రాణు— చిత్తము (అని వ్రాసిపలుకను బిగించుట)

1 రాణు— చేతులకును గాళ్లకును మొలఁదిట్టముగ బిగించితి రా!

2 రాణు— ఆహా ఈ మొలలనూడదీయ వీనియబ్బతరముగాదు.

1 రాణు— ఈదొంగలనిద్దరిని స్లీవలవేయుఁడు.

2 రాణు— వేయుచున్నాము (అని స్లీవలలోఁగొట్టుట)

1 రాణు— ఈజేసునాథుని స్లీవ మొదట నిలిపి దానికిరుపార్శ్యముల యందు నీదొంగలసిలువల నిలువుఁడు

2 రాణు— చిత్తము (నిలుపుట)

1 రాణు— ఇప్పుఁడుగదా జేసువు మాపరులకానందమును గలిగించు చున్నాడు?

2 రాణు— దుర్మార్గులారా మీకు దగినశిక్షయే విధింపబడినది ఆచార్యులవారి కోరిక ఫలించినది.

1 రాణు॥ కం॥ జూదుల రాజుకు మ్రొక్కుఁడు
సాదరముగ మోక్షమొసఁగు • సరసులకెపుఁడున్
భేదమునెంచక వేదము
బోధించును రాజ్యమంతఁ • బుణ్యుండగుచున్.

2 రాణు॥ పుణ్యవంతుఁడగుటచేతనే యిప్పుఁడువాని పుణ్యముపండినది లేనియెడలనింత సమాధానమైన మరణమెవరికి లంభించును.

1 రాణు ఓరిక్రీస్తునాథుఁడా! నేనుదేవాలయమును బడగొట్టి మూఁడు దినములలోఁ గట్టెదనని ప్రగల్భించితివిగదా! అట్టిశక్తినీకుఁగలిగి యున్న యీస్లీవనుండి దిగిరమ్ము

2 రాణు॥ ఓరేనీవు నిజముగా దేవునికుమారుఁడవైతివేని తక్షణ మీ సిలువ నుండి దిగిరమ్ము

3 రాణు॥ ఓరేనీవు నీశిష్యులకు సతతజీవ్యమునొసఁగు వాఁడవుగదా? నీవు చిరకాలజీవికారాదు రా!

4 రాణు॥ ఓరిమాంత్రికుఁడా! నీవు నిశ్చయముగాఁ బరలోకమునుండి దిగివచ్చిన వాఁడవైతివేని త్వరఁగా నీసిలువనుండి దిగిరమ్ము. మే మందరమునిన్ను విశ్వసించి నీమతములోఁ బ్రవేశించెదము.

జేసు—ఓసర్వేశ్వరా! ఈ జనసమూహము తామేమి చేయుచున్నదియు నెరుగరు. కావున నన్ను గూర్చి వీరిని క్షమించుము.

మొదటిదొంగ—ఓస్వామీ! నీవు క్రీస్తువైతే నిన్ను నీవు రక్షించుకొని మమ్ము రక్షింపఁగూడదా?

రెండవదొంగ—ఓరి దొంగలమేటీ! మనము పరమదుర్మార్గులముగుటచే మనకుఁదగినశిక్షవిధింపఁబడినది. ఈసన్మార్గుఁడో యంటే కళంక రహితుఁడు అన్యాయశిక్ష ననుభవించుచున్నాఁడు. ఓ లోక నాథుండవైన జేసునాయకా! నీవు నిశ్చయముగ సత్యదేవుని కుమారుఁడవనియు మానవరక్షణార్థము శిరించితివని నా మనస్ఫూర్తిగా విశ్వసించుచున్నాను. దేవర వారా! నా పాపములకుఁ బశ్చాత్తాపము నొందుచున్నాను. నీవు నీరాజ్యములోఁ జేరినపుఁడు నన్ను మరువకుండి.

జేసు—పుత్రకా! నీ విశ్వాసమున కానందించుచున్నాను. నీవు నాతో పాటు నానందవదవిలో నుండెదవు.

(దేవమాత జ్యాన్సునులు ప్రవేశించుట.)

దేవమా—హాకుమారా! నా ప్రేవులు కలుగుకొని వొవ్వుచున్నవి నీ యవస్థనెట్లుఁ జూడఁగలను? ఎట్లుసహింపగలను!

జేసు—ఓ స్త్రీ! నేటినుండి నీకుమారుఁడు జ్యాన్సునుడే సుమీ! ఓజాఁన్సునా నేటినుండి యీ మెనీతల్లి.

దేవమాత—నాయనా! నాకు ప్రత్తో వఁజూపించుచున్నావా?

సీ॥ మనుజుల రక్షింప • మహికి నేతెంచిన
పట్టినిన్నడఁబాసిఁ • బ్రతుకఁగలనె
పరిశేయులందఱు • పట్టినీ వల్లోఁగొట్టి
చంపగనేనింకఁ • జరుగఁగలనె
హితవాక్కు నెఱవేర్పఁ • బ్రీతితో నిచ్చెడి
మనుజావతార నే • మనగగలనె
దావీదు వంశంబుఁ • ధరణి గాపాడిన
పరమపావన నేను • బ్రతుకఁగలనె

గీ॥ అకట సుకుమార దివిరేఁగి • యచటమమ్ము
పరమపదవికిఁ జేర్చుచు • భక్తహృదయ
మెఱవ కిమ్మహి నుండక • మహిమదనర
పాలకానంద మయరూప • లీలదీవ.

తండ్రీ! ఈవరిజేయూఁలో నొక్కరికైన మనుజాళి జనింపరాదా? నిన్ను యవస్థనుండి దప్పింపఁ రాదా? అకటా! ఈము ష్కరు లెంత హింసించిరి. యెంతయవమానింపదల పాల్జేసిరి, నేనెట్లు సహింతును? యెట్లు జీవింపనేర్తును? ఈప్రపంచమున దలనెత్తి నెట్లుఁదిరుఁగనేర్తును? అలనాఁడు అన్నమ్మ శిమి యోనుల దీర్ఘదర్శనము నెఱవేర్చితివిగదా? హా! కుమారా! నాకడుపు మండిపోవుచున్నది. నాహృదయము భిన్నములగుచున్నది నేనెవరినిఁ దూరుదునాయనా? యెట్లూరడిల్లుదునుగండ్రీ! ఎవరినిజూచుకొని యీ పుడమిపైఁ దిరుగనేర్తును? హా! దీనజనపోషకా, ఆర్తజనరక్షకా, నాకు రనాలింపువారెవరు ?

జ్యాన్నేను—గురువర్యా! భవదీయనాజ్ఞను శిరసావహించుచున్నాను. నీతల్లిని నాతల్లినిగా సంరక్షించెద.

సీ॥ సర్వేశుఁడవై యుండి • సత్యంబు గాపాడ
సిలువమరణగాంచి • చెందినావ?
పితయభిప్రాయంబుఁ • బ్రీతితో నెఱవేర్ప
భువినవమానంబుఁ • నొందినావ?
మనుజసంతతిమీఁది • మమతనుఁ జూపింప
భూరిహింసలనెల్లఁ • గోరినావ?
స్వర్గపురిద్వారంబు • సడలించిఁ దెఱువను
నింపుతో బాధ స • హించినావ?

గీ॥ దీర్ఘదర్శుల వ్రాతలు • తేటపడఁగ
పుడమికరుదెంచి నావ శ్రీ • పుణ్యచరిత
గాక లోకుల రక్షింపఁ • గడఁగిఁ ప్రాణ
మిచ్చుచున్నావ! యోజింప • మీఁకధాత్రి.

జేసునాయకా! నిన్ను విడనాడి నేను నీప్రపంచమున నొక్కక్షణమైన యమైనను జీవింపఁజాలను? నీబాధల నాకన్నులఁ జూడఁజాల. నిన్నుఁ

చూచిన నాగుండలవియుచున్నవి, కొండవలె నండగానుండ కాచుకున్న నీవుండని యీ ప్రపంచమేల,రబ్బీ! ననుకనికరించుము. నీవెంట ననుదీసికొని పొమ్ము (అని కూలబడును)

రాణు—ఓరి పిచ్చివాడా! నీనోటికివచ్చినట్లు పట్రపేలకుము. వీనిదరి ద్రమే నీకుఁ గావలెనా?

2 రాణు—ఓరి మిత్రులారా! ఇదియేమి యతిశయము! ప్రపంచమందంతయు మిట్ట మధ్యాహ్నమున గాఢాంధకారమయముచే నావరింపఁబడినది!

1 రాణు—సఖులారా! భయపడకుఁడు. ఇదింతయును జేసు క్రీస్తు మంత్ర ప్రభావము.

జేసు—హా దైవము! నన్నేలఁ జెయి విడచితివి!

2 రాణు—చెయివిడవక నెల్లకాలము నిన్ను పట్టుకొనియే యుండునా!

3 రాణు—ఓరి క్రీస్తునాథుఁడా! నీవు దైవకుమారుఁడవు కావా! మఱి యెవరినో పిలుచుచున్నావేమిరా!

జేసు—నాకు దాహ మగుచున్నది.

4 రాణు—(పుల్లనిరసములో స్పంజిఁ దడిపికర్రతో నందించును) ఇదిగో జేసునాథుఁడా! నీదాహమునుఁ దీర్చుకొనుము.

జేసునాథు—(రుచిచూచి బిగ్గరగా) అంతా నెఱవేరెను.

1 రాణు—నెఱవేరకఁ గొంత బాకి యున్నదా!

జేసునాథు—(బిగ్గరగా) ఓపితయైన సర్వేశ్వరా! నాయాత్మను నీ చేతులలోఁ బెట్టుచున్నాను. (అని తల వంచుట)

2 రాణు—అవునవును ఆతనిచేతులలో భద్రముగాఁ బెట్టుము.

1 రాణు—ఓరి సఖులారా! రేపు పాస్కపండుగయై యున్నది. శవము లెంతమాత్రము నుండఁగూడదు. ఈ మొండిముండాకొడుకులు త్వరఁగాఁ జచ్చేటట్టు గాన్పింపలేదు. కొట్టి చంపుఁడు.

3 రాణు—(జేసునిజూచి) అరెరే! చచ్చినాడురా బాబు. ఇంకను హింసింపవలయునని నాకు బహుకోరిక యుండెను. వానిమీద నాకసి నింకను దీరలేదు. నాయీఈటెచే నాతని డొక్కఁ జించెద" (అని డొక్కలో కుమ్మట నీచునీళ్లు కారుట)

1 రాణు—(దొంగల నిద్దరినిఁ గొట్టి చంపుట.)

2 రాణు— మిత్రులారా! ఇప్పటికి మనవిధికృత్యములు నెఱవేఱినవి. కాని మిట్టమధ్యాహ్నము మూఁడుగంటలవేళన సూర్యుఁడు మాయమై ప్రపంచ మంతయు గాఢాంధకారములోఁ మునుఁగుటకుఁ గారణమేమి? సూర్యుని మరుఁగుపఱిచెడి శక్తి మానవులకుఁ గలదా? ఇవియన్నియు జేసునాధుని మంత్రప్రభావములని నమ్మవచ్చునా? నాకు సందియముఁ గలుగుచున్నది.

2 రాణు— అయితే అతఁడుఁ జెప్పుకున్నట్లు దేవుని కుమారుఁడు కావచ్చును.

3 రాణు—ఇదియంతయు నిదానముగా నాలోచిస్తే అతఁడు దేవుని కుమారుఁడని స్ఫురింపకఁబోదు.

4 రాణు— సత్యముగా సర్వేశ్వరుని కుమారుఁడైనచో సైతానే మనకు శరణము, నరకమే సంప్రాప్తము. (నిష్క్రమించుదురు.)

రెండవ రంగము.

(పిలాతుఁడు అనానుఁడు కైపాసుఁడు జూదులు రాణువవారు)

పిలాతుఁడు— కీర్తన.

1 ఏమి చిత్రమో - ఇది - యేమి సూత్రమో
భూమి యదరె నభమువణకె - కమలహితుఁడు క్రుంగిపోయె॥ ఏమి॥

2 కారుచీకటి - నిది - కమ్మనేటికి
తీరుతీరురంగులన్ని - జారసాగె జ్వాలలై యిల ॥ కేమి॥

3 గుండెలవియగా నా - కొండబండలు
ఖండఖండలయ్యె చూడ - శవములుమూత బడగసాగె ॥ నేమి॥

ఆచార్యులారా! క్రీస్తునాధుని ప్రాణముఁ బోవునప్పు డీసంభవములు కలిగినవి. మీరుకూడ చూచియున్నారు. ఇప్పుడతని నెవనిగా భావింపవలయునో యీసభారంగమున బయలుపఱచుడు.

1 రాణు—ప్రభువర్యా! మీరువర్ణించిన యద్భుతము లోకలెక్కలో నివి కావు. అతఁడు మృతిబొందినప్పుడు సమాధులు తెరువఁబడెను. మృతులు లేచి మన పట్టణమున దిరుగసాగిరి. వారలు కొందరి దృష్టిపథమునఁబడిరి.

పిలాతు—భేష్ - ఇది మహాయతిశయమని జెప్పఁ దప్పదు. ఇంక నేమైన నద్భుతంబులు కలిగినవా?

2 రాణు—దేవా, ఆసమయముననే దేవాలయపు తెఱబట్ట తనంతట తానే రెండు చీలికలుగాఁ జీలిపోయెను.

పిలాతుఁడు—అబ్బబ్బా! ఇదియేమి విచిత్రము. ఇందు విషయములో నచ్చటి ప్రజల యభిప్రాయము లేమి?

1 రాణు—ప్రభువా! శ్రీజేసునాథుఁడు లోకనాథుఁడనియుఁ దైవకుమారుఁడనియు దృఢముగా విశ్వసించిరి.

కైపాసుఁడు—(లేచి బిగ్గరగా) ఛీ ఛీ నోరుమూయుము. ప్రభువర్యా! వీని మాట లన్యాయములు. ఈ విచిత్రము లన్నియు క్రీస్తువను వాని మంత్రప్రభావములుగాని వేఱు కాదు. గలిలేయదేశము మొదలుకొని జెరుసలేమువఱకుఁగల ప్రజలకు దనయందు నమ్మకముఁ గలిగించుకొనుటయే వానిమంత్రసామర్థ్యము వెల్లడించుచున్నది.

(జోసెపుఁడు నికోదేముఁడు ప్రవేశించుట)

జోసెపుఁడు
నికోదేముఁడు } పిలాతు ప్రభువర్యా! నమస్కారములు.

పిలాతు—మనోవాంఛాఫలసిద్ధిరస్తు. ఆర్యులారా! మీ రేకారణమున మా యాస్థానమున కేతెంచితిరి.

జోసెపుఁడు—ప్రభువర్యా! రేపు పాస్కపండుగదినము. శవములుండఁ గూడదని దేవరవారికిఁ దెలియని సంగతి కాదు. జేసునాథుని శవము కపాలపర్వతమున స్లీవపై నున్నది. తమయాజ్ఞయైనచో మేమిప్పుడే వెళ్లి యతనిని భూస్థాపితముఁ జేయించెదము.

పిలాతుఁడు—ఆజ్ఞ నిచ్చితిని. అతనిని పరిమళగంధముల లేపనముఁజేసి త్వరగా భూస్థాపితముఁ జేయుఁడు.

జోసెపుఁడు—చిత్తము. పిలాతుప్రభువర్యా! నమస్కారములు.

పిలాతుఁడు—ఈప్సితార్థసిద్ధిరస్తు (జోసెపు నికోద్యాదులు వెళ్లుట)

కైపాసుఁడు—ప్రభువర్యా! ఒక్క మనవి. జేసువనువాఁడు తన వేదముఁ బ్రసంగించునప్పుడంతయు, నేను మరణమునొందిన మూఁడవనాఁడు పునరుత్థానమయ్యెదనని బహిరంగా బ్రకటించుకొని యున్నాఁడు.

కావున దేవరవారు నాయందుకనికరించి యతని సమాధికి రాజ ముద్ర ముద్రింపించి మూడుదినములు కావలాజేయుటకై రక్షక సైన్యమున కాజ్ఞనొసఁగ వేడుచున్నాను.

అనానుఁడు—ఆప్రకారము మీరు భద్రపఱచనిచో నతని శిష్యులాతని శవమును దొంగఁదీసి యతని ప్రకటనల స్థిరపఱచినచో మన దేశమున కమితముగా నరిష్టముఁజుట్టుకొనును ప్రజలలో నంతః కలహములు పుట్టును. దేశమున సంక్షోభము జనించును. దానిని వారించుట కసంభవము.

పిలాతుఁడు—మంచిది. మీ మనవి నంగీకరింపఁబడినది. జేసునాధుని సమాధికి రాజము ద్ర ముద్రింపించెదను. రక్షకసైన్యము నానమా ధిని గావలాఁగాచుటకై నాజ్ఞనిచ్చుచున్నాను.

మూఁడవ రంగము.

(కపాలపర్వతము—జేసునాధుఁడు శ్లీవపైనుండుట దేవమాత జ్వాన్నేను మఱికొందఱు స్త్రీలుంఢుట; జేసునాధుని పాదముల మగ్దలేనమ్మ బట్టుకొనియుండుట దేవమాత జేసునాధుని పూర్ణాలింగము జేసి కొనియుంఢుట.)

దేవమాత—మూఁడులోకంబుల • ముంపఁజాలినవాని
కీలాటి యవమాన • మేలవచ్చె
నతికయ మొప్పార • నవతరించినవారి
కీలాటి హింసలు • నేలవచ్చె
పాపులరక్షింప • బలమున్నవారికి
యీలాటి మరణంబు • నేలవచ్చె
మెరుగు బంగరువన్నె • మేనున్నవారికి
యీలాటి కడగండ్లు • నేలవచ్చె
గీ॥ అకట మృదువైనదేహంబు • నంతఁజినిగి
రుధిరమీలాగు నేరులై • రూఢిమెరయ
బారసాగనునేమందు • భవ్యచరిత
భక్తజనపోష యానంద • పరమపురుష.

హా! ముద్దుకుమారా! నీవుండని నాకీజీవితమేల! కాల్పనా! జూదులంద రుద్దండులై నీకుఁ గలిగించిన యపనిందెల నెట్లుసహించుదును. నీవు మూ

డవనాఁడు పునరుత్థానమగుదువని నాకు పూర్ణ విశ్వాసమున్నది. తండ్రీ నాథైనను కనులకానందము గావింపుము. అకటా! ఈ మూఁడుదినము లెట్లు గడుపుదును. నాయనా ఈదుఃఖసాగరము నెట్లు నీదఁగలను, ఘడియయొక యుగముగానున్నది.

జ్యాన్నేను॥ సీ॥ ఆది యంత్యము లేని • యకళంకదైవమై
దుష్టయూదులఁ జేతఁ • జిక్కవచ్చె
అంతట వ్యాపించి • యాత్మ సౌందర్యవై
యూదహింసల చవిఁ • జూడవచ్చె
దేహరహితుండవై • ధీరవరమూర్తివై
పలువిధనిందలఁ • బడఁగవచ్చె
ఆనందపదవికి • నధిపుసర్వేశువై
సిలువమరణంబున • జేరవచ్చె
గీ॥ మృదుతరంబైన దేహంబు • మీకు తాల్చి
మనుజరక్షణ గాంక్షించి • మహిమదనరి
బలియునై తిరి ప్రజలకై • బాగుమీర
ధరణి గురువర్య శిష్యులు • శాస్త్రధుర్య.

కీర్తన.

1 జేసువ నీప్రేమఁ - జెప్పగజాల
దానులఁబ్రోవనై - ధరణి బలియైతివే॥
2 ఒరులకైఁ బ్రాణంబు - నొసఁగునే యీధాత్రి
పరువడి నింకొకడు - పట్టి యోజింపఁగ॥ జేసు॥
3 నీప్రేమ వర్ణింప - నేనెంతవాడను
కాపాడి రక్షింపఁ గలవు నేకాలము॥ జేసు॥

జోసేపుడు—(ప్రవేశించి) అమ్మా! మరియమ్మగారా! మీరిట్లు విలపించుట నాకాశ్చర్యముగా నున్నది. "జేసునాథుఁడు లోకరక్షణార్థమే తెంచినవాఁడనియు దీర్ఘదర్శనములఁ జెల్లించెదరనియు, మీకు స్పష్టముగా దెలిసియు నిట్లు విలపించుట చిత్రముగా నున్నది. తల్లీ! పిలాతుఁడు జేసునాథుని శరీరము భూస్థాపితమును జేసికొనుటకు నాజ్ఞ నిచ్చియున్నాఁడు అందులకు కార్యక్రమమున కుపక్రమింపవలెను.

## తృతీయాంకము.

దేవమాత—మంబద.

13 స్థలము.

జోసేపుండు నిక్రోదేముండు జేసునాధుని స్లీవనుండి దించి పరిమళ తైలముం బూసి దేవమాత యొడిలో బెట్టుట.

దేవమాత॥ కీర్తన.

1 నినుబాయజాలర - శ్రీజేసువా ॥నిను॥
మనుజులంబ్రోవనై మహికవతరించిన - తనయుండచూడుము॥ శ్రీ॥
2 కనికరముననను కనుంచూడవేమి - నినునమ్మియున్నాను॥ శ్రీ॥
3 యెఱుగక జూదులు - హింసించి స్లీవపైం గొట్టిరి నినుచావ శ్రీ॥

జ్వాన్నేను—అమ్మా! చింతింపకుము. మనము శ్రీజేసునాధుని త్రిదినసములలో జూడగలము. గతించినకార్యమునకు జింతించుట గతజల సేతుబంధనమువంటిది.

జోసేపుడు—శాంతించుము తల్లి (అని అందఱు భూస్థాపితము చేయుట.
(అందఱు నిష్క్రమించుట)

5 రంగము.

Resurection of Jesus Christ.

జేసునాధుండు మృతినిజయించి యుత్థానమగుట.

(రాణువ వారువచ్చి జేసునాధుని సమాధికి రాజముద్రవేసి దాని చుట్టు పరుకొని యుండుట.) (జేసునాధుండు సమాధినుండి లేయుట. రక్షకసైన్యము చెల్లాచెదరై పారిపోవుట. మరియమగ్దలేన్మ సలోమేయమ్మ వచ్చుట.) సన్మనస్కుండు (ప్రవేశించి)

సీ॥ సర్వేశు తనయుండు • జనమును రక్షింప
మరియగర్భమునందు • మనుజుండయ్యె
ముప్పదివర్షముల్ • ముదముతోం దలిదండ్రు
లాజ్ఞల జవదాట • డయ్యె ధాత్రి
నలుబది దివసంబు • లిల తపోవ్రతమున
మునిజనసేవ్యుండై • మోదమొందె
మూడేండ్లు సువిశేష • మును బోధగావించి
పరిజేయుజనులచే • బట్టువడియె

గీ॥ స్త్రీసమరణంబునొందె గ • తేసత్యులైన
పిత్పలకునెల్ల నస్మృత్తిఁ • బిలచిరొయునగ
నేఁడు మూఁడవదివసంబు • నిజసమాధి
నుండి యుత్థానమైరి రో • నువెదలార.

(అని సమాధిపైఁబండను దొర్లించుట.)

సన్మంనుష్యుడు—భక్తాగ్రేసరులారా! భయపడకుఁడు నాముచ్చటనాల
కించుఁడు

సీ॥ శ్రీజేసునాధుండు • జెప్పినరీతిఁగా
నుత్థానమయ్యెను • నువెదలారా
మరియకుమారుండు • మహిమచేవిలసిల్లి
గలలేయకరిగిరి • గరితలార
వారిశిష్యులఁజేరి • వారియుత్థానంబుఁ
బ్రకటించుచెప్పుఁడు • పడతులార
అతిరయమున శిష్యు • లందఱి స్త్రీపౌర్ద్ద
సొమ్మనిజెప్పుఁడు • పొలతులార

గీ॥ అతఁడు నలుబది దివసంబు లవనియుండి
శిష్యసమితికి బోధించి • శ్రేష్ఠమైన
జ్ఞాన మొసగను స్వరితః • స్వాంతమైన
వారి బుత్తెంచు సత్యంబు • వనితలార॥

మరియమగ్దలేనమ్మ—చిత్తము మీయాజ్ఞానుసారముఁవర్తించెదము.

సన్మనుష్యుడు—

గీ॥ కువలయంబున వర్షంబుఁ • గురియుగాక
పాడిపంటలు పుడమిపైఁ • బ్రబలుగాక
పడతులిల సాధ్వీనులు నోచు • వరలుగాక
కవులు ప్రజలంమ ఘనతను • గాంతురుగాక॥

గద్య॥ ఇది శ్రీజేసునాథస్వామి వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర రేచర్లగోత్ర
పవిత్ర గంజియున్నారెడ్డి పుత్రబాలశౌరిరెడ్డినామధేయప్రణీతంబైన
ద్వి తీ యాం క ము స ర్వ ము
సం పూ ర్ణ ము.